CHAITANYAMANAVI R.NO.APBIL/2019/78298

# చైతన్య మానవి

VOL : 2 ISSUE : 8,9 GUNTUR, AUGUST, SEPTEMBER , 2020 56 PAGES RS.20/-



బందీఖానాలో
ప్రజా పోరాట స్వరాలు
పీడితుల పక్షపాత పిడికిళ్లు
ఇదే నేటి స్వాతంత్ర్యం

# మానికొండ సూర్యావతిగారి వర్ధంతి సభా దృశ్యాలు

విజయవాడ



బొబ్బిలి



విశాఖపట్నం



పశ్చిమ గోదావరి



తిరుపతి



విజయనగరం



లక్ష్మి సెహగాల్ వర్ధంతి సందర్భంగా

కర్నూలు



టి. సి.లక్ష్మమ్మగారి వర్ధంతి సందర్భంగా



మహబూబ్‌నగర్ ఐద్వా జిల్లా కార్యదర్శి అరుణకు జోహార్లు

సంపాదకీయం

# ఇదేనా స్వాతంత్ర్యము..?

ఆగస్టు 15న జాతి యావత్తూ స్వాతంత్ర్యదినోత్సవాన్ని జరుపుకుంది. స్వాతంత్ర్యం సాధించడానికి తమ జీవితాలు ధారపోసిన నాయకులు ఏమి ఆశించారు? నాడు సాధించుకున్న స్వరాజ్యం నిజమైన స్వాతంత్ర్యమేనా? అతి పిన్నవయస్సులోనే ఉరికంబానికి ఎక్కిన భగత్ సింగ్ ఒక రాజకీయ పార్టీని ఏర్పాటు చేశాడు. దాని పేరు హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ. సుభాష్ చంద్రబోస్ అజాద్ హింద్ ఫౌజ్‌ను ఏర్పాటు చేశారు. గాంధీజీ 1947 ఆగస్టు 15 స్వాతంత్ర్య వేడుకలలో పాల్గొనలేదు. దేశ విభజన కారణంగా చెలరేగిన మత కల్లోలాను ఆపడానికి నైఖాలీ వెళ్లాడు. మత భేదాలు లేని సర్వసత్తాక రాజ్యం కావాలనుకున్నాడు. రామ్‌రహీంలు ఒక్కరే అన్న ఆలోచనలు ఈ దేశప్రజల హృదయాలలో పదిలంగా ఉండాలన్న ఆయన ప్రయత్నం ఆర్ఎస్ఎస్‌కు రుచించలేదు. ఆర్ఎస్ఎస్ విష ప్రబోధంతో మతవిద్వేషం తలకెక్కిన గాడ్సే తుపాకీ గుళ్లకు మన జాతిపితగా పిలవబడినబాపూజీ బలయ్యాడు.

ఆకలి, నిరుద్యోగం, హింసల నుండి అజాదీ కోసం నినదించిన కన్హయ కుమార్ కుట్ర కేసులో జైలుకు పంపబడ్డాడు. పౌరచట్టం సవరణను, జాతీయ పౌరసత్వ రికార్డు పేరుతో జరిగే వివక్షతను ప్రశ్నించినందుకు ఐదు నెలల గర్భవతి అని కూడా చూడకుండా సఫోరాను జైలుకి పంపారు. అంబేద్కర్ మనవడు, విశ్వవిద్యాలయ ఆచార్యుడుగా పనిచేస్తూ హక్కుల గురించి, ప్రజాస్వామ్యం గురించి మాట్లాడినందుకు, సుధాభరద్వాజ్ న్యాయవాదిగా ఉంటూ కార్మిక హక్కుల కోసం కృషి చేసినందుకు, ఇతరుల సహాయం లేకుండా నడవలేని ప్రొఫెసర్ సాయిబాబు, తాను నమ్మిన విశ్వాసాల కోసం నిలబడిన వరవరరావులు ఇలా అనేకమంది జైల్లో బంధించబడ్డారు. కాశ్మీర్‌ను విభజించి ఎక్కడకు పంపించారో, బతికున్నారో, చనిపోయారో కూడా తెలియకుండా వేల మందిని జైళ్లకు పంపారు. బహిరంగ జైలుగా మార్చారు. భగత్ సింగ్‌ను ఉరితీసి, కమ్యూనిస్టులపై కుట్ర కేసులు పెట్టి సత్యాగ్రహులను జైలు పాల్జేసిన బ్రిటీష్ ప్రభుత్వానికి మోడీ ప్రభుత్వానికీ తేడా ఏమిటి?

స్వతంత్రం వస్తే మన వనరులను మనమే ఉపయోగించుకోవచ్చనుకున్నారు. అందరికీ పని దొరుకుతుందని, తిండి కోసం అల్లాడాల్సిన పరిస్థితి పోతుందని, ఏది మంచో ప్రజలందరూ చర్చించుకుని పాలన సాగించుకోవచ్చని, అందరికీ అన్ని అవకాశాలు కల్పించడం ద్వారా పేద, ధనిక అంతరాలను తొలగించవచ్చని కలలు కన్నారు. భగత్‌సింగ్, ఆయన సహచరులు చిన్ననాడే స్వేచ్ఛ బ్రిటిష్ వారి నుండి మాత్రమే కాదని దోపిడీ దారులనుండి కూడా స్వేచ్ఛను కోరుకున్నారు.

కాని నేడు మన ఓట్లను సైతం పాలకవర్గాలు మాయమాటలతో కొల్లగొడ్తున్నారు. ఇచ్చిన వాగ్దానాలను పక్కనపెట్టి ప్రజలను విభజించి పాలిస్తున్నారు. విద్వేషాలను పాలుపోసి పెంచుతున్నారు. అందరికీ పని కల్పించడం అన్న లక్ష్యాన్ని పక్కన బెట్టి రిజర్వేషన్లే సమస్యకు మూలమన్నట్లు చిత్రిస్తున్నారు. కులాల మధ్య కుంపటి మండిస్తున్నారు.

ఆగస్టు '5' రామజన్మభూమి శంకుస్థాపనతో స్వాతంత్ర్యం వచ్చిందంటూ నాజీజర్మని అభినవ వారసులుగా భారతపౌరుల మధ్య మేము మీరు అంటూ శాశ్విత విభేదాలను కల్గించే ఆర్ఎస్ఎస్ సిద్ధాంతాన్ని ప్రజల బుర్రల్లోకి ఇంకించే ప్రయత్నం చేస్తున్నారు. శంభూకుడి తపస్సు ధర్మానికి విరుద్ధమనే బ్రాహ్మణాధిపత్యధోరణులనూ నూతన విద్యావిధానం ద్వారా మహిళలకు దళితులకు, ఆదివాసీలకు ముస్లిములకు పేదలకు విద్యను దూరం చేయటానికి పూనుకున్నారు. కార్మికులు సాధించుకున్న చట్టాలను రద్దు చేసి యజమానుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడేలాగున పద్ధతులను రూపొందిస్తున్నారు. నూటికి 60% ప్రజల ఆధారమైన వ్యవసాయాన్ని కంపెనీల చేతుల్లో పెట్టేందుకు స్వేచ్ఛపేరిట నిత్యావసరాలను మార్కెట్‌కు వదిలేశారు. పాడిపంటలు రైతన్న చేతుల నుండి దళారీలకు అప్పచెప్పారు. శోధించి నిగ్గుదేల్చి ఎంతో కొంత సమాజంలో ఉన్న బలహీనుల రక్షణకుద్దేశించిన చట్టాలను చాపచుట్టి జమ్మి చెట్టుమీద పెట్టేందుకు చట్టసరవణలకు ఓ కమిటీని ఎలాంటి విధివిధానాలను పాటించుకుండా తమ తైనాతీ ఏర్పాటు చేశారు. ప్రజల సంపదతో నిర్మితమైన బృహత్తర ఆర్థిక సంస్థలైన బ్యాంకులను, చౌక ప్రయాణ సాధనంగా ఉన్న రైళ్లను, భారీ పరిశ్రమలను, చివరకు రక్షణ కల్పించే యుద్ధపనిముట్లను అన్నింటి స్వదేశీ, విదేశీ పెట్టుబడి దారుల చేతులకు అప్పగిస్తున్నారు.

ప్రజలకు తీవ్ర ఇక్కట్లు తెచ్చిన కోవిడ్ లాక్‌డౌన్ సమయంలో ఆనాటి విదేశీ బ్రిటీష్ రాజ్యం కంటే స్వదేశీ ప్రభుత్వమే ప్రజల నవనాడులను తమ చేతుల్లోకి తీసుకున్నది. మరో స్వాతంత్ర పోరాటానికి సిద్ధం కావాల్సిన తరుణం ఆసన్నమైంది. ఆకలినుండి, హింస నుండి, కులమత విద్వేషాల వరకు కార్పొరేట్ శక్తులకు అప్పగిస్తున్నది. ఫలితంగా కోసం పూనుకోవాలి. పని, తిండి, భద్రత, గౌరవమైన జీవితాన్ని సాధించాలి. అందుకోసం ప్రజాస్వామిక హక్కులను నిలబెట్టుకోవడానికి కదలాలి.

ఏడుస్తూ కూర్చుంటే.. కన్నీళ్లు కరిగిపోతాయి..
ఏడుపు నీ గుండెల్లో దాచిపెట్టు..
గెలుపు కోసం పరిగెట్టు..
నీ జీవితాన్ని నువ్వు నిర్ణయించుకో..

# చైతన్య మానవి

సంపుటి: 2
సంచిక: 8,9



**ఐద్వా ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం**

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
పి.ఎల్.రావు భవన్, 2/7 బ్రాడీపేట,
గుంటూరు, గుంటూరు జిల్లా - 522002,
ఆంధ్రప్రదేశ్, ఫోన్ : 9490098620
chaitanyamanavi@gmail.com
fb : aidwaap
Blog : aidwaap@blogspot.com



ప్రజాశక్తి ప్రింటర్స్ & పబ్లిషర్స్
ప్రైవేట్ లిమిటెడ్

**పోస్టల్ చందా**
సంవత్సరానికి రూ : 150/-
విడి ప్రతి వెల రూ : 10/-

వ్యాసాలు, లేఖలు పంపించవల్సిన చిరునామా :
డోర్‌నెం. 31-5-6, మారుతీనగర్,
ప్రకాశరావు వీధి, చుట్టు గుంట సెంటర్,
విజయవాడ - 4

## ఈ సంచికలో





PRINTED AND PUBLISEHD BY D. RAMA DEVI, AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM, PRINTED AT PRAJASAKTI PRINTERS & PUBLISHERS PVT. LTD. 14-12-19, PRAKASH NAGAR, KRISHNA NAGAR (P), TADEPALLI (M), GUNTUR DIST.PUBLISHED AT AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM AIDWA STATE OFFICE P.L.RAO BHAVAN, 2/7 BRODIPET, GUNTUR-522002, ANDHRA PRADESH STATE. EDITOR: D. RAMA DEVI. R.NO. APBIL/2019/78298

B. హరితాదేవి



# కరోనా - ఆరోగ్యం - రాజకీయాలు

"ఆరోగ్యమే మహాభాగ్యం" అనే విషయాన్ని కరోనా మరోసారి రుజువు చేసింది. మనుషులకు కావలసిన ప్రాథమిక అవసరాలైన ఆహారం, ఆరోగ్యం యొక్క ప్రాధాన్యతను కరోనా మన ముందు వుంచింది. ఆరోగ్య సంరక్షణ అనేది దేశంలో ముఖ్య విభాగం. ప్రజలు ఆరోగ్యంగా వుంటే దేశం ఆరోగ్యంగా వున్నట్టే. ఆరోగ్య సంరక్షణ అంటే కేవలం వ్యాధులకు చికిత్స చేయటం ఒకటే కాదు. ప్రజల ఆరోగ్యం మెరుగుపడేలాగా చెయ్యాలి. ప్రజల ఆరోగ్యం మెరుగుపడాలి అంటే వారికి పౌష్టికాహారం లభించేలా ప్రభుత్వాలు చెయ్యాలి. ప్రజలు మానసికంగా, శారీరకంగా ఆరోగ్యంగా వుంటేనే సమాజం ఆరోగ్యంగా ఉన్నట్లు.

భారత దేశంలో ప్రభుత్వాలు సామాన్య ప్రజల పట్ల ఎంత అలసత్వం వహిస్తారో కరోనా కాలంలో ప్రత్యక్షంగా కనబడింది. కేసులు తక్కువగా వున్నప్పుడు హఠాత్తుగా లాక్ డౌన్ పెట్టి వలస కార్మికులని ఇబ్బందుల పాలు చేసింది. కేసులు పెరుగుతున్న ఈ సమయంలో ప్రజలను గాలికి వదిలేసింది ప్రభుత్వం. కరోనా విజృంభిస్తున్న ఇలాంటి తరుణంలో ప్రభుత్వాలు తగినన్ని పరీక్షలు చెయ్యటం లేదు. ప్రభుత్వ ఆసుపత్రులలో తగినన్ని సౌకర్యాలు కల్పించటం లేదు. డాక్టర్స్‌కి సరిపోయినన్ని పిపిఈ కిట్స్ ఇవ్వటం లేదు. అహర్నిశలూ శ్రమిస్తున్న నర్సులకు, అంగన్ వాడి కార్యకర్తలకు, ఆశా వర్కర్లకు భద్రత కల్పించలేదు. అతి తక్కువ మరణాల రేటు ఉన్న కరోనా మీద ప్రజలలో అవగాహన కల్పించకుండా వారిని భయభ్రాంతులకు గురి చేస్తుంది. అందరి దృష్టి కరోనా మీదకు మళ్లించి సర్కార్ ప్రభుత్వ ఆస్తుల అమ్మకాలకు మళ్లింది. ప్రజల సొమ్ముతో నిర్మించుకుని అభివృద్ధి చేసుకున్న నవరత్నాల కంపెనీలను, ఇస్రో లాంటి గొప్ప సంస్థలను, ప్రజలను తక్కువ ఖర్చుతో వేల మైళ్ళ దూరానికి తీసుకుని వెళుతున్న రైల్వేలను కార్పోరేట్స్‌కు దోచి పెట్టటానికి అన్ని మార్గాలను తెరచి వుంచింది. లాక్‌డౌన్ కాలాన్ని ఆరోగ్య వ్యవస్థలను బలోపేతం చెయ్యటానికీ, అవసరాలను సమకూర్చడానికీ ప్రయత్నించని భారత ప్రభుత్వం ఇప్పటి ఆరోగ్యరంగ సంక్షోభానికీ, కరోనా విజృంభనకు ప్రధాన కారణం.

భారత దేశంలో ప్రభుత్వ ఆసుపత్రుల దీనస్థితి అందరికీ తెలిసిందే. వాటిలో డాక్టర్స్ వుండరు. మందులు వుండవు. నర్సులు వుండరు. ఎప్పటి నుంచో ఈ పరిస్థితి వుంది. దీనికి ప్రధాన కారణం ఆరోగ్య రంగానికి బడ్జెట్‌లో కేటాయింపులు తక్కువగా వుండటమే. భారత జి డి పి లో కేవలం 2 శాతం కంటే తక్కువే ఆరోగ్యానికి కేటాయించబడుతుంది. ప్రభుత్వాలకు సామాన్య ప్రజల పట్ల ఎంత నిర్లక్ష్యమో అర్థం అవుతుంది. వైద్య రంగానికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ ఖర్చు చేస్తాయి. ప్రపంచ ఆరోగ్య సంస్థ ఐదు శాతం కేటాయించాలని చెబుతుండగా కేంద్రంలో ఏ ప్రభుత్వాలు వున్నా అది 2 శాతాన్ని మించటం లేదు. ఆరోగ్యానికి కేటాయింపులు దేశం యొక్క జి డి పి లో 3 శాతం, రాష్ట్రాల జి డి పి లో 1.5 శాతం వుండాలన్న నియమాన్ని ఏ ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. ఆరోగ్య రంగంలో ప్రైవేటు జోక్యం ఇటీవలి కాలంలో బాగా పెరిగింది. కానీ ఆ చార్జీలు సామాన్యులు భరించ గలిగేవి కాదు. బ్రిక్స్ (బ్రెజిల్, రష్యా, చైనా, భారత్, దక్షిణ ఆఫ్రికా) దేశాలలో ఆరోగ్య రంగంలో భారత దేశమే అత్యంత తక్కువ ఖర్చు చేస్తుంది. బ్రెజిల్ తన జి డి పి లో 9.2 శాతం, చైనా 5 శాతం ఖర్చు చేస్తున్నాయి.

సామాన్యులకు వచ్చే 90 శాతం జబ్బులకు కార్పోరేట్ ఆసుపత్రులలో చికిత్స దొరకదు. స్పెషలైజేషన్ పేరుతో ప్రాథమిక ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేస్తున్నారని అనేక నివేదికలు చెబుతున్నాయి. ప్రాథమిక వైద్యాన్ని నిర్లక్ష్యం చేసిన ఫలితాలు ఇప్పుడు అమెరికా, యూరోప్ దేశాలు ఎదుర్కొంటున్నాయి. జబ్బులు వచ్చాక వైద్యం చెయ్యటం కాదు, రాకుండా నివారించటం ముఖ్యం. మంచి ఆహారం, శుభ్రమైన పరిసరాలు, ఆరోగ్యకరమైన సమాజం అందుకు తోడ్పడుతుంది.

దేశంలో ఆరోగ్యం కోసం వినిపిస్తున్న గళాలను తృప్తి పరచటానికి ఆరోగ్య భీమా

పథకాన్ని తీసుకుని వచ్చారు. భీమా కల్పిస్తే సరిపోతుందనే భావనలో ప్రభుత్వాలు వున్నాయి. ప్రజలకు ముఖ్యంగా పేదలకు ఆరోగ్యాన్ని అందించే ప్రజారోగ్య వ్యవస్థలకు తగినన్ని నిధులు అందించకుండా వాటిని నిర్వీర్యం చేస్తున్నారు.

దేశంలో ఐదేళ్లలోపు ఉన్న మూడోవంతు మంది పిల్లలు పోషకాహార లోపంతో బాధపడుతూ, అంటువ్యాధులూ, దీర్ఘకాలిక వ్యాధులూ ఎప్పటికప్పుడు పెరిగిపోతున్న పరిస్థితులలో అనారోగ్య భారానికి కొనసాగింపుగా ఈ అలక్ష్యం కనిపిస్తోంది. ఎప్పటికప్పుడు పెరిగిపోతున్న ఆరోగ్య ఖర్చుల వల్ల ప్రజలు తీవ్ర ఆర్థిక సంక్షోభంలోను, దారిద్ర్యంలోను కూరుకుపోతున్నట్లు ప్రభుత్వ పత్రాలు పేర్కొంటున్నాయి. ఆరోగ్య భీమా వల్ల సొంత ఖర్చుల మీద కానీ, పేదల ఆరోగ్య భద్రత మీద కానీ పెద్దగా ప్రభావం లేదని నివేదికలు తేల్చి చెబుతున్నాయి.

భారతదేశంలో 67శాతం ఆరోగ్య ఖర్చులను చేతి నుంచే భరించాల్సి ఉంటుంది. ఇందులో 63 శాతం తాత్కాలిక చికిత్స (ఔట్ పేషెంట్) కోసమే ఖర్చవుతుంది.

ప్రస్తుతం ఉన్న ఆర్ఎస్బీవై పథకం కింద ఆసుపత్రి ఖర్చులను పూర్తి మొత్తంగానో, కొంత భాగంగానో తిరిగి పొందేవారి శాతం చాలా తక్కువ. పైగా ఈ పథకం కింద ఉచిత సేవలను అందించే ఆసుపత్రులు ఎక్కడో పట్టణాల్లో ఉండటమో, వాటికంటే ప్రైవేటు ఆసుపత్రుల సంఖ్య గణనీయంగా ఉండటమో జరుగుతోంది. **ఆరోగ్య సంరక్షణకు సంబంధించిన ప్రభుత్వ విధానాలు, ఖర్చులు, భీమా వైపుగా మొగ్గు చూపడంతో ప్రాథమిక ఆరోగ్య పరిరక్షణ, ప్రజోపయోగ ఆరోగ్య సేవలు మరింత అలక్ష్యానికి గురవుతున్నాయి. పైగా ఇది ప్రైవేటురంగంలో ఉన్న బీమా సంస్థలకు ప్రయోజనకారిగా ఉండటం వల్ల బడ్జెట్ ప్రసంగం తర్వాత సదరు కంపెనీల షేర్లు ఒక్క సారిగా ఎగిసిపడ్డాయి. 2017 జాతీయ ఆరోగ్య విధానం "దృఢమైన ఆరోగ్య పరిశ్రమ రెండంకెల వృద్ధి"ని సాధించగలదని పేర్కొంది. ప్రభుత్వ ఆరోగ్య రంగాన్ని నిర్లక్ష్యం చేయడం వల్ల, స్తోమత లేనివారు కూడా ప్రైవేటు ఆరోగ్య రంగం మీద ఆధారపడక తప్పడం లేదు.** ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాలలో మౌలిక సదుపాయాల లేమి, సిబ్బంది లోటు,



తగినన్ని యంత్రాలు మందులు లేక పోవడం వంటి సమస్యలు ఉండటం వల్ల జనం ప్రైవేటు ఆరోగ్యరంగం మీద ఆధారపడక తప్పడం లేదు. ప్రస్తుత ఆరోగ్య విధానం కూడా ప్రైవేటు ఆరోగ్య సంరక్షణ వైపే మొగ్గు చూపుతోంది. వీటికి భారతీయ ప్రజల ఆరోగ్యం, స్వస్థత కంటే లాభార్జనే ముఖ్యం.

సరైన నియంత్రణ, పరిపూర్ణమైన ఆరోగ్య సేవలు లేకుండా ప్రజలు ఆరోగ్య అవసరాల కోసం ప్రైవేటు రంగం మీద ఆధార పడటం వల్ల ఆరోగ్యం అందరికీ చేరువవ్వదనేది ప్రపంచవ్యాప్తమైన అనుభవం. ఈ నేపథ్యంలో తగిన బడ్జెట్ కేటాయింపులు, మెరుగైన మౌలిక సదుపాయాలు, మానవ వనరులను వినియోగించి ప్రజారోగ్య యంత్రాంగాన్ని బలపరచడం మీద భారత దేశం దృష్టి సారించాలి. ఇదే సమయంలో ఎప్పటి కప్పుడు పెరిగిపోతున్న ప్రైవేటురంగాన్ని అదుపు చేయడంలో కూడా పురోగతి సాధించాలి.

ఆరోగ్య వ్యవస్థ బలంగా ఉన్న దేశాలు, కోవిడ్ తదనంతరం తీసుకున్న పటిష్ట చర్యల వలనే ప్రపంచంలో చైనా, క్యూబా ఇటలీ, స్పెయిన్, న్యూజిలాండ్ లాంటి దేశాలు కోవిడ్ని నిరోధించగలిగాయి. మనదేశంలో కేరళ రాష్ట్రం కూడా పటిష్ట చర్యలు చేపట్టి ఆదర్శంగా నిలిచింది. కోవిడ్పైనే శ్రద్ధంతా పెట్టినట్లు చూపిస్తున్న ప్రభుత్వం సాధారణ వైద్యాన్ని నిరాకరించడం ద్వారా ప్రజల ప్రాణాలను గాలిలో దీపంగా మార్చింది.

వాయిదా వేయడానికి వీలులేని ప్రసవాలు చేయడానికి కూడా సరైన ఏర్పాట్లు లేనందున ప్రసవ వేదనలో తల్లులు మరణిస్తున్నారు. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు, గర్భనిరోధక సాధనాలు కూడా లేక అవాంఛిత గర్భాల వల్ల సమస్య ఎదుర్కొంటున్నారు. షుగరు, బి.పి, గుండె జబ్బులు,. కేన్సర్ తదితర దీర్ఘకాలిక రోగులకు కూడా ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయడంలో ప్రభుత్వాల వైఫల్యం కన్పిస్తుంది.

ప్రయివేటీకరణ అంటే పేదలకు ఆరోగ్యం అందకుండా చేయడమే. డబ్బున్న వాళ్ల ప్రాణాలకు కూడా రక్షణ లేదని విజయవాడలో కోవిడ్ కేంద్రం (స్వర్ణ ప్యాలెస్)లో మంటలలో మరణించిన ఘటన మరోసారి రుజువు చేసింది. ❖




# వదిలేయ్.. వాళ్లతో పెట్టుకోకు

ఆమె మంచికోసమే చెప్పి ఉంటారు. 'వదిలేయ్.. వాళ్లు పెద్దవాళ్లు..' అని! అంటే... డ్యూటీని వదిలేయమనా?! లా అండ్ ఆర్డర్‌ని వదిలేయమనా?! మనమేం చేయలేం, చేతులు ఎత్తేయమనా?! పోలీస్ అయింది.. పట్టుకోడానికి కానీ వదిలేయడానికా! మొత్తంగా ఉద్యోగాన్నే వదిలేసింది సునీత. ఆర్డర్‌లో ఉంచలేనప్పుడు యూనిఫామ్ ఎందుకనుకున్నది.

లేడీ 'సింగం' గర్జిస్తే ఎలా ఉంటుంది? లేడీ 'సింగం' తీక్షణంగా చూస్తే ఎలా ఉంటుంది? సినిమాల్లో కాదు. నిజంగానే ఒక లేడీ పోలీస్.. 'లా అండ్ ఆర్డర్' డ్యూటీలో ఉన్నప్పుడు ఎలా ఉంటుంది? నెట్‌లోకి వెళ్లి చూడండి. ఒక ఆడియో, ఒక వీడియో! దేశమంతా సునీతా యాదవ్ గర్జనని ఆడియోలో వింటోంది.

ఆమె తీక్షణతను వీడియోలో చూస్తోంది. బాలీవుడ్ నటి స్వరాభాస్కర్.. 'వారెవ్వా.. సునీతా!' అని హ్యాట్సాఫ్ చెప్పారు. మరో నటి తాప్సీ పన్ను 'సెల్యూట్ సునీతా' అన్నారు. ఇండియన్ పోలిస్ ఫౌండేషన్.. సునీత 'సెన్సాఫ్ డ్యూటీ'ని, 'బ్రేవరీ'ని ప్రశంసించింది. "ఒక మహిళా పోలీస్ తన విధి నిర్వహణలో గట్టిగా నిలబడితే, ఆమె పైనున్న అధికారులు జారిపోకూడదు" అని ఫౌండేషన్ ఆమెకు గట్టి మద్దతునిస్తూ మాట్లాడింది. అయినా జారిపోయారు. ఒక్కొక్కరూ సునీత పక్కనుంచి తప్పుకున్నారు.

మొదట ఆమెను ఉన్నఫళంగా ఆమె చేస్తున్న వరచ్ఛ పోలీస్ స్టేషన్ పరిధిలోని కర్ఫ్యూ నైట్ పెట్రోలింగ్ డ్యూటీ నుంచి తప్పించారు. తర్వాత ఆమెను సిక్ లీవుపై వెళ్లమన్నారు. తర్వాత ఆమెను సూరత్‌లోనే వేరే చోటికి ట్రాన్స్‌ఫర్ చేశారు. తర్వాత ఆమెపై ఎంక్వయిరీ పెట్టించారు. పేరుకు అది 'ఆనాటి ఘటన'పై ఎంక్వయిరీ. వాస్తవానికైతే సునీతపై ఎంక్వయిరీ. రిజైన్ చేసేశారు సునీత. తనంతట తను రాజీనామా చేసిందని గుజరాత్ పోలీస్ డిపార్ట్‌మెంట్ రిలీఫ్‌గా ఫీల్ అవచ్చు. సునీత ఎందుకు రిజైన్ చేయవలసి వచ్చిందో దేశమంతా చూసింది. అయితే ఆమె రాజీనామాను సంతోషంగా అంగీకరించడం ఆమె పై అధికారులకు తెలికేమీ కాబోవడం లేదు.

లాక్‌డౌన్ కర్ఫ్యూ నిబంధలను ఉల్లంఘించి ఐదుగురు స్నేహితులతో కారులో తిరుగుతున్న అధికార పార్టీ ఎమ్మెల్యే పుత్రరత్నాన్ని సునీత ఆపినందుకు, ఘర్షణకు దిగిన అతడిని బుక్ చేసినందుకు ఇంతా అయింది! ప్రకాష్ అతడి పేరు. వరచ్ఛ మార్గ్ నియోజకవర్గం ఎమ్మెల్యే కుమార్ కనాని కొడుకు. కుమార్ కనాని ఆరోగ్యశాఖ సహాయ మంత్రి కూడా. గత బుధవారం ప్రకాష్ తన ఫ్రెండ్స్‌ని వేసుకుని కారులో రోడ్డు మీదకు వచ్చినప్పుడు డ్యూటీలో ఉన్న సునీత అతణ్ణి ఆపి వివరాలు అడిగారు. "ఎమ్మెల్యే కొడుకుని" అన్నాడు ప్రకాష్. ఆధార్ కార్డు ఒకటి చాలు ఇన్‌ఫర్మేషన్ అంతా అందులోనే ఉంటుంది అన్నట్లు తండ్రి పేరు చెప్పి ఊరుకున్నాడు. సునీత ఊరుకోలేదు. కారులోంచి దింపి అతడిని, అతడి ఫ్రెండ్స్‌ని నిలబెట్టారు. ఎమ్మెల్యే కొడుగ్గా తనేం చేయగలడో చెప్పాడు ప్రకాష్. పోలీస్‌గా తన డ్యూటీ ఏంటో అది చేశారు సునీత.

చట్టం ముందు అంతా సమానమే. జూలై 8 రాత్రి ఈ ఘర్షణ జరిగితే ఎమ్మెల్యే కొడుకును, అతడి స్నేహితులను అదుపులోకి తీసుకోడానికి నలభై ఎనిమిది గంటలు పట్టింది. వాళ్లను వదిలిపెట్టడానికి నాలుగు నిముషాలు కూడా పట్టలేదు. "నిన్ను ఇక్కడే, నువ్వు నిలుచున్న చోటే 365 రోజులు నిలబెట్టిస్తాను" అని సునీతను బెదిరించాడు. ఆ ఎమ్మెల్యే కుమారుడు సునీతతో ఘర్షణకు దిగినప్పుడు! అయితే ఆ పంతం మరోలా నెరవేర్చుకున్నాడు. ఆ చోటులో ఆమె మళ్లీ నిలబడకుండా చేశాడు. అయితే అతడు పైచేయి సాధించింది సునీత మీద కాదు పోలీస్ డిపార్ట్‌మెంట్ మీద.

**సునీత యంగ్ పోలీస్ కానిస్టేబుల్. 'చూసుకుని పోవడం' అనే విద్య ఆమెకు ఇంకా పట్టుబడలేదు. రిజైన్ కూడా చేసేశారంటే అలాంటి విద్యలకు తను పట్టుబడటం ఆమెకు ఇష్టం లేదనే అర్థమౌతోంది. సునీత గురించి ఆమె ధైర్యం ఒక్కటే ఇప్పుడు ఆమె వ్యక్తిగత వివరాలలో ప్రతిచోటా కనిపిస్తోంది.**

అది చాలు.. గుజరాత్ పోలీస్ డిపార్ట్‌మెంట్ ఆమెకు ఒక ప్రమోషన్ ఇచ్చి తనని తను గౌరవించుకునేందుకు. ప్రమోషన్ అంటే ఏం లేదు. చేతికి లాఠీ ఇచ్చి, తిరిగి అదేచోట.. ఎక్కడైతే ఆమెను ఏడాది పాటు నిలబెడతానని ఎమ్మెల్యే పుత్రుడు 'శపథం చేశాడో.. సరిగ్గా అక్కడే మళ్లీ డ్యూటీ వెయ్యడం. అంత ధైర్యం డిపార్ట్‌మెంట్‌కి ఉందా?! ❖

# ఆమె అద్భుతః



ఆమె మాట వినండి !
ఆమెతో నడవండి !
కానీ ఆమెపై తీర్పులివ్వకండి
ప్రతి స్త్రీకి ఒక గతం ఉంది
కొందరు శారీరకంగా వేధింపులకు గురయ్యారు.
కొందరికి హింసాత్మక తల్లిదండ్రులు ఉన్నారు.
కొందరికి యుక్తవయస్సు సమస్యలు ఉన్నాయి.
కొందరు తమ కుటుంబ సభ్యుల నుంచే లైంగిక వేధింపులకు గురయ్యారు.
కొందరు ప్రేమ కథలను గందరగోళపరిచారు.
కొందరిని ప్రేమ పేరిట బలవంతంగా వ్యభిచారంలోకి దించేశారు
కొందరు మత్తు పదార్థాలు తీసుకున్నారు.
కొందరు రేపెకు గురయ్యారు.
కొందరిని దుర్మార్గంగా ఫోటోలు తీశారు
కొందరిని పూర్వ ప్రియులు బ్లాక్ మెయిల్ చేశారు
కొందరు దుర్వినియోగ సంబంధంలో ఉన్నారు
కొందరికి రుతు సమస్యలు వచ్చాయి.
కొందరు విడిపోయిన కుటుంబంలో పూర్వ సభ్యురాళ్లు
కొందరు విడాకులు తీసుకున్నారు
కొందరికి ఊబకాయం సమస్య
కొందరికి ఆర్థిక కరువు
కొందరు మాదకద్రవ్యాల పాలయ్యారు
కొందరికి మద్యపాన వ్యసనం ఉంది
కొన్ని విజయవంతం కాని ఆత్మహత్యాయత్నాలు జరిగాయి.
ఆ గతంతో ఆమెను కించపరచవద్దు
ఆమెను మరింత దుర్వినియోగం చేయవద్దు.
ఒక స్త్రీని మీరు చూసినట్లయితే,
అప్పటికే ఆమె కన్నీళ్లను తుడిచిపెట్టి
దుఃఖాలకు చిరునవ్వు ముసుగు వేసి
బలంగా, సమున్నతంగా నిలబడి
భవిష్యత్తు వైపు నడవడం ప్రారంభించింది
ఎందుకంటే? ఆమెకు ఇంకా కొంత ఆశ ఉంది
ఆమె ఈ ప్రపంచంలో మిగిలి ఉన్న ప్రేమ భావనను వదలలేదు
ఆమెకు మార్గం ఇవ్వండి!
ఆమె పక్కన తోడుగా నడవండి.
ఆమె చేతులు పట్టుకుని కాసేపు నడవండి.
ఆమె ఆత్మ ఎంత అందంగా?? ఉందో,
ఆమె ఆశలు ఎంత బలంగా ఉన్నాయో మీకు తెలుస్తుంది!
ఆమె శక్తినంతా పీల్చేసినా
ఎలా ముందడుగు వేస్తుందో చూసి మీరు ఆశ్చర్యపోతారు
ఆమె ఎప్పుడూ పక్కింటి మహిళ మాత్రమే కావాల్సిన అవసరం లేదు
ఆమె మీ స్నేహితురాలు, మీ సోదరి, మీ భార్య కావచ్చు
మీ తల్లి కూడా కావచ్చు
గతాన్ని బట్టి ఆమెపై తీర్పులివ్వొద్దు
ఆమెకు అర్థవమైన, ప్రశాంతమైన భవిష్యత్తును బహుమతిగా ఇవ్వండి!
ఆమె గతాన్ని బట్టి ఆమెపై తీర్పులివ్వొద్దు
ఆమెకు అర్థవమైన, ప్రశాంతమైన భవిష్యత్తును బహుమతిగా ఇవ్వండి.
ప్రపంచానికి వ్యతిరేకంగా ఆమె చేయి పట్టుకోండి.
ఆమె ఎప్పుడూ ఆరాటపడే ప్రేమను అందివ్వండి!
మహిళలు...
ప్రేమకు ప్రతిబింబాలు,
ప్రశాంతతాభయారణ్యాలు.

# పంతులును సన్మానించిన 'సంస్కరణల వ్యతిరేకులు'



**వీ**రేశలింగం పంతులు రాసిన పుస్తకాల సంఖ్య నానాటికీ పెరిగిపోయింది. వాటిని ముద్రించడానికి ధనం సమస్య వచ్చింది. అందుకు చెన్నపట్టణములో ముద్రణాలయం ఏర్పాటు చేయాలనుకున్నారు. రాజ మహేంద్రవరంలోని ప్రెస్‌ను చిత్రపు నరసింహారావుకు అమ్మారు. న్యాపతి సుబ్బారావు వద్ద వెయ్యి రూపాయలు అప్పుగా తీసుకున్నారు. ఇంగ్లండు నుంచి ఆవిరితో పని చేసే ప్రెస్‌ను తెప్పించారు. పంతులుగారి తోడ్పాటు లేనందున 'చింతామణి' పత్రికను న్యాపతి సుబ్బారావు సక్రమంగా నిర్వహించలేక పోయారు. చెన్నపట్టణం నుంచే దానిని నడపమని పంతులుకు అప్పగించారు. ఇంగ్లండు నుంచి తెప్పించిన ప్రెస్‌కు 'చింతామణి ముద్రాక్షరశాల' అని పేరుపెట్టారు.

రాజమహేంద్రవరంలో పాఠశాల అందుబాటులో లేకపోవడం వల్ల వున్నత విద్య కొరవడింది. అందువల్ల ఆధునిక నాగరికతకు మార్గం లేకుండా పోయింది. గోదావరి ఆధ్యాత్మిక పర్యాటక కేంద్రం అవడం వల్ల ఛాందస భావాలతోనూ, బ్రాహ్మణులతోనూ నిండి వుంది. ఆధునికతను ద్వేషించే రాజమహేంద్ర వరంలో వీరేశలింగం ఆధ్వర్యంలో సంస్కార కార్యక్రమాలు మొదలు పెట్టారు.

అయితే ఊసర క్షేత్రంలో కష్టపడ్డ కర్షకుని కష్టం మాదిరిగానే పంతులు కృషి వృధా అయింది. అందువలన చెన్నపట్టణంలో తన ఆశయం సఫలమవుతుందని ఆశించి అక్కడే స్థిరపడదల్చానని పంతులు గారు ప్రయాణానికి సన్నాహాలు మొదలు పెట్టారు. రాజమహేంద్రవరం వదలి పంతులుగారు వెళుతున్నారని తెలిసి అంతకుముందు ఆయనను వ్యతిరేకించిన వారందరూ ఏకమై ఒక సభ ఏర్పాటు చేసి వారి వీడ్కోలుకు విచారం తెలియజేస్తూ ఉపన్యసించారు. పంతులుగారి పైన పద్యములు రాసి చదివి వినిపించారు. విందులు చేశారు. కొన్ని సమాజముల వారు పంతులుగారిని తమ మధ్య కూర్చోబెట్టుకుని ఫోటోలు దిగారు. పత్రికలలో ప్రశంసిస్తూ వ్యాసాలు రాశారు. కాకినాడలో కూడా ఇదే విధముగా సభలు-సమావేశములు జరిపి పంతులుగారిని సన్మానించి వీడ్కోలు చెప్పారు. 1897 సంవత్సరాంతమున కుటుంబ సమేతంగా పంతులుగారు చెన్నపురి చేరారు.

అప్పటి వరకు రాజమహేంద్రవరంలో 27 వితంతు వివాహాలు జరిగాయి. గంజాం జిల్లాలోని ఆస్కా గ్రామములో ఒక బాల వితంతువు ఉంది. రాజమహేంద్రవరంలో జరిగిన వితంతు వివాహ వార్తను పత్రిక నుంచి తన అన్న చదువుతుండగా విన్నది. ఆ సంగతి వదినతో చెప్పింది. వదిన "తప్పు, ఆ మాట అనకూడదు" అంటూ మందలించింది. ఆ వితంతువుకు ఎలాగైనా రాజ మహేంద్రవరం వెళ్లాలనే కోరిక కలిగింది. అదే గ్రామంలో మరొక బాల వితంతువు ఉంది. వారిద్దరూ కలిసి రాజమహేంద్ర వరం చేరాలని నిశ్చ యించుకున్నారు. ఎవరికీ చెప్పకుండా ఓ రోజు గ్రామం విడిచారు. అక్కడ నుంచి విజయనగరం చేరారు. అయితే రెండో వితంతువు భయపడి అక్కడే ఆగి పోయింది. మొదటి వితంతువు మాత్రం తన దగ్గరున్న బంగారం అమ్ముకొని, అద్దె బండిలో కొంత దూరం, కాలి నడకన మరికొంత దూరం, ఇలా తిప్పలు పడి ప్రయాణిస్తూ పంతులుగారి ఇల్లు చేరుకుంది. ఆమెకు 1893 జూన్ 29వ తేదీన సోమనాథరావుతో వివాహం జరిగింది.

చెన్నపట్నంలోని స్వగృహం చేరిన తరువాత పంతులుగారికి తన పుస్తకాలు అచ్చు వేయడానికి రెండు సంవత్సరాలు పట్టింది. వారి పుస్తకాలు పది పెద్ద సంపుటాలయ్యాయి. పంతులుగారు శారీరకంగా దుర్బలుడు అయిన కారణంగా చింతామణి పత్రికను ఏడాది మాత్రమే నడిపి తరువాత నిలిపివేశారు. సంఘ సంస్కరణ పనులు చేతనైనవంత వరకూ నిర్వహించారు. **సంఘ సంస్కరణ సమాజానికీ, దక్షిణ హిందూ స్థాన బ్రహ్మ సమాజానికీ పంతులుగారిని అధ్యక్షుడిగా ఎన్నుకున్నారు. చెన్నపురి పాఠశాల పుస్తక దేశ భాష సంఘం తమ కార్యనిర్వాహక సంఘ సభ్యులలో పంతులుగారిని కూడా ఒక సభ్యుడిగా ఎన్నుకున్నారు. దొరతనము సంస్థ కూడా తమ పాఠ్యగ్రంథ సభలో వీరేశలింగాన్ని సభ్యుడిగా చేర్చుకున్నారు. సర్వ కళాశాల యాజమాన్యం కూడా పంతులును ద్రావిడ భాష అధ్యయన కమిటీలో సభ్యుడిగా చేర్చుకుంది. తెలుగు పరీక్షలకు సంబంధించి పంతులును ప్రభుత్వం పరీక్షకునిగా నియమించింది.** పంతులు చెన్నపట్నం వెళ్లినప్పుడు అక్కడ సంఘ సంస్కరణ సమాజం ఆధ్వర్యంలో సహపంక్తి భోజన ఉద్యమం కొనసాగుతున్నది. ఒకసారి పంతులుకు సహపంక్తి భోజనానికి పిలుపు వచ్చింది.

**(మిగతా వచ్చే సంచికలో)**



# పొంచి వుంది ప్రమాదం!

## నానాటికీ పడిపోతోన్న మహిళల సంఖ్య

**దే**శ జనాభాలో మహిళల సంఖ్య రానురానూ తగ్గిపోతోంది. ఇది పెను ప్రమాదానికి దారితీయవచ్చు. ఐక్యరాజ్య సమితి జనాభా సంబంధిత సంస్థ (యుఎన్ఎఫ్‌పిఎ)తో కలిసి లైంగిక, పునరుత్పత్తి ఆరోగ్య సంస్థలు సంయుక్తంగా నిర్వహించిన ప్రపంచ నివేదిక - 2020 ప్రకారం గడిచిన 50 ఏళ్లలో ప్రపంచ వ్యాప్తంగా 14.30 కోట్ల మంది మహిళలు కనిపించకుండా పోయారు. వారిలో 4.60 కోట్ల మంది మనదేశం నుంచేనని నివేదిక స్పష్టం చేసింది. 50 ఏళ్ల క్రితం అంటే 1970లో ప్రపంచ వ్యాప్తంగా ఈ సంఖ్య 6.10కు మాత్రమే పరిమితమయింది. అయితే ప్రస్తుతం ఇది రెట్టింపయింది. ఆడపిల్ల పుడితే కొందరు చేతులారా చంపేస్తుండగా, లింగ నిర్ధారణ పరీక్షలు చేయించుకుని, పుట్టబోయేది ఆడపిల్లని తెలుసుకుని గర్భంలోనే మట్టుబెడుతున్నారు. ఈ తీరున ఆడపిల్లల మరణాలు ఎక్కువవుతున్నాయని నివేదిక పేర్కొంది. 2013-17 మధ్య దేశంలో 4 లక్షల 60 వేల మంది బాలికలు ప్రసవ సమయానికే ప్రాణాలను కోల్పోయారు. లింగ నిర్ధారణ పరీక్షల వల్ల కనుమరుగైన వారు మొత్తం సంఖ్యలో 2/3వ వంతు మంది కాగా, ప్రసవానంతరం మరణించినవారు 1/3వ వంతు మంది ఉంటున్నారు. వెయ్యి మంది బాలిక జననాల్లో 13.5 శాతం మంది ఎదిగే క్రమంలో నిర్లక్ష్యానికి గురై మరణిస్తున్నారు.

స్త్రీ, పురుషుల్లో నెలకొంటున్న ఈ అసమానత వివాహ వ్యవస్థపై అనివార్యంగా ప్రభావం చూపుతోంది. వివాహం సంప్రదాయంగా ఉండే దేశాల్లో ఈ లోపం స్పష్టంగా కనబడుతోంది. ఈ అసమానత వల్ల పురుషులు తమకు సరైన జోడీని (జీవిత భాగస్వామిని) ఎంచుకోవడంలో ఆలస్యం చేయడంగానీ, లేదా అసలు వివాహమే చేసుకోకుండా ఉండిపోతున్నారు. వరుని వయస్సు వధువు కంటే రెట్టింపు ఉండడానికి కూడా ఇదే కారణం. అదే సమయంలో బాల్య వివాహాలు జరిగేందుకు కూడా ఈ పరిస్థితి దారితీస్తోందని నిపుణుల అంచనా. **స్త్రీ పురుషుల సంఖ్యలో అసమానత 2055 నాటికి గరిష్టస్థాయికి చేరుకుంటుందని పేర్కొంటున్నారు. దేశంలో 50 ఏళ్లకు కూడా వివాహం చేసుకోని పురుషుల సంఖ్య 2050 నాటికి 10 శాతం పెరుగుతుందని నివేదికలో పేర్కొంది.**

**ప్రపంచవ్యాప్తంగా లక్షల సంఖ్యలో మహిళలు శారీరకంగా, మానసికంగా హింసకు గురవుతున్నారు. బాల్య వివాహాలకూ, బాలికలను గర్భంలోనో, పొత్తిళ్లలోనో మట్టుబెట్టే పనికి కుటుంబాలు, స్నేహితులు, పరిచయం ఉన్న వ్యక్తుల మద్దతు తోడవడం బాధాకరం** అంటోంది ఐక్యరాజ్యసమితి నివేదిక. సుమారు 19 రకాల హింసలు. ఉదాహరణకు మహిళల వక్షాకృతిపై వ్యాఖ్యానాల నుంచి కన్యత్వ పరీక్ష వరకూ మానవ హక్కుల ఉల్లంఘన కిందకే వస్తాయని యుఎన్ఎఫ్‌పిఎ నివేదిక తేల్చి చెప్పింది. బాలికలపై జరుగుతున్న హింసాత్మక చర్యలు వారిలో శాశ్వత గాయాలను చేస్తున్నాయి. క్రమేణా వారి సామర్థ్యాన్ని తగ్గిస్తున్నాయని యున్ఎఫ్‌పిఎ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ డాక్టర్ నటాలియా కనీమ్ అంటున్నారు. ఈ ఏడాది సుమారు 41 లక్షల మంది బాలికలను బలవంతంగా చంపేస్తారనీ, 33 వేల మంది బాలికలకు 18 ఏళ్ల లోపునే బలవంతపు వివాహాలు చేస్తారని నిపుణుల అంచనా.

బాలికలకు ఉన్నత విద్యాభ్యాసం కల్పించడం, జీవన ప్రమాణాలు మెరుగుపర్చడం, బాలబాలికల్లో సామాజిక చైతన్యం తీసుకురావడం వంటివి క్రమం తప్పకుండా చేస్తే వచ్చే పదేళ్లకయినా బాల్యవివాహాలు, ఎఫ్‌జిఎం వంటివి తగ్గుముఖం పడతాయని వివేదిక పేర్కొంది. ప్రోత్సాహక కార్యక్రమాలకు ఏడాదికి రూ. 34 వేల కోట్ల చొప్పున పెట్టుబడి పెడుతూ 2030 వరకూ కొనసాగిస్తే ఈ హింసాత్మక చర్యలకు గురవుతున్న దాదాపు 8.40 లక్షల మంది మహిళలు విముక్తి పొందుతారు. అయితే ఇటీవల కరోనా కారణంగా ఇటువంటి కార్యక్రమాల నిర్వహణకు గండిపడింది. ❖

# ఏం మారింది నా దేశం

విశ్వమాతృ గర్భం నుండి
ఇంకా జన్మించని ఒక శిశువు
ఒక ఉదయించని ఒక ఉదయం
ఒక పుష్పించని మొగ్గ
ఒక వెలగని దీపం
ఒక కురవని మేఘం
ఒక స్వతంత్ర, అశ్వతంత్రస్వరం
నా భారతదేశం, ఎన్నేళ్లు దొర్లినా
ఎన్ని ఎన్నికల జాతరలు గడిచినా
ప్రజాస్వామ్యాన్ని
ప్రసవించనివ్వని,
ఫలం చేతికందనివ్వని,
ఎందరో మంత్రసానులు,
తంత్ర కుతంత్ర మాన్యులు,
మానవతనే మరచిన,
కసాయిల కపోలాల్లో తల్లడిల్లే,
నిండు గర్భిణి, నా భారతదేశం
దేశాన్నే కిడ్నాప్ చేసి
విదేశీ విపనిలో బేరానికి నిలబెట్టిన
బందిపోట్ల మధ్య బందీ
నా భారత దేశపు,
కంఠం వణుకుతోంది



అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడైనా



జాతీయగీతం
గాలిలో దీపంలో రెపరెపలాడుతోంది
జాతీయపతాకం
కాలం బోనులో ఒదిగి ఒదిగి
మంచాన ఉన్నాడు స్వాతంత్ర్య
సమరయోధుడు
గెలిచి ఓడినవాడు
అహింసా గడియారం ఆగిపోయిన వాడూ
నీతి న్యాయం, సత్యం, ధర్మాలను సమాధి చేసిన
ఒక క్రూర పరిహాసం నా భారతదేశం
ప్రజాస్వామ్యంలో పద్మవ్యూహం గెలవదు,
ప్రకృతికి ఎవరూ పాఠాలు నేర్పనక్కరలేదు,
భువన భోంతరాలు ఏకమైనా
స్త్రీ మూర్తి ప్రసవిస్తుంది
శిశువును సాకుతుంది
నేటితరం
వెయ్యితరాల తిరుగుబాటు భాష
నేర్పుతుంది.
ఈ తరాన్ని ప్రసవించేదే
నా భారత దేశం
కోటి కోటి జనావళిలో వెలిగే జ్యోతి
నా భారత దేశం



## ఆర్మీలో మహిళలకు శాశ్వత కమిషన్

### ఉత్తర్వులు వెలువరించిన రక్షణశాఖ

**సు**దీర్ఘకాలంగా ఆర్మీలో మహిళలు చేస్తున్న పోరాటానికి ఫలితం దక్కింది. సాయుధ దళాల్లో మహిళలకు శాశ్వత కమిషను ఏర్పాటయింది. ఈ మేరకు కేంద్ర రక్షణ మంత్రిత్వ శాఖ అధికారిక ఉత్తర్వులు జారీ చేసింది. తాజా ఉత్తర్వులతో ఆర్మీ ఎయిర్ డిఫెన్స్ సిగ్నల్స్ ఆర్మీ ఏవియేషన్ తో పాటు ఆర్మీ లోని 10 విభాగాల్లో మహిళా అధికారులకు శాశ్వత కమిషన్ ఏర్పాటు చేయనున్నారు. ఈ మేరకు షార్ట్ సర్వీస్డ్ కమిషన్లో పని చేస్తూ అర్హతగల అధికారులు దీనికి సన్నద్ధం కావాలని రక్షణ మంత్రిత్వ శాఖ సూచించింది. ఆర్మీలో తమకు పురుషులతో పాటు సమాన హోదా కల్పించాలని కోరుతూ మహిళలు చాలా కాలంగా పోరాడుతున్నారు. దీనిపై విచారించిన దేశ అత్యున్నత ధర్మాసనం మహిళలకు శాశ్వత కమిషన్ పై నిర్ణయం తీసుకోవాలని గతేడాది నవంబర్లో కేంద్రాన్ని ఆదేశించిన విషయం విదితమే.

# సుజాత

**గత నెల సంచిక తరువాయి**



ఏడు గంటలు కావొస్తుండగా రైటర్ వచ్చాడు. అతనిది యాభై అయిదు ఏళ్ల పైబడ్డ వయసు. సన్నగా, కొద్దిగా ఒంగి ఉన్నాడు. బట్టతల. వాడి అయిన చూపు.

“అమ్మాయ్, నువ్వు ఇలా ఊరేగింపులో దిగాల్సింది కాదు. పోనీలే, చిన్నపిల్లవి. తెలియక చేసుంటావు. నువ్వు వ్యక్తిగత పూచీకత్తు రాసి ఇవ్వు. ఇంటికి పంపేస్తాం,” అన్నాడు.

అతని మాటల్లో ప్రభుత్వం, దాని సర్వ పాలనాంగాలతోనూ రూపుకట్టినంత స్పష్టంగా నాకు మరెక్కడా కనిపించలేదు. అతను నన్ను పట్టుకున్న పోలీసులానే మాట్లాడుతున్నాడు. ఒక ప్రాసిక్యూటర్‌లాగా నా మీద నేరారోపణ చేస్తున్నాడు. తనే న్యాయమూర్తిగా జడ్జిమెంట్ వినిపిస్తున్నాడు. తనే ఈ వ్యవస్థ కొమ్ముకాచే ఒక వ్యాపారస్థుడిలాగా పూచీకత్తు అడుగుతున్నాడు. తన పౌరుల ప్రవర్తనని, తన పిల్లల ప్రవర్తనలాగా శాసించాలని చూసే ఒక పితృ ప్రభువులాగా నన్ను మందలిస్తున్నాడు.

అతను పోలీస్ స్టేషన్లో రైటరు. అతని చేతిలో కలం ఉంది. పీనల్ కోడ్ సెక్షన్లు అతనికి కంఠోపాఠం. అతని మీదనే న్యాయదేవత త్రాసు నిలిచి ఉంది.

కానీ నేను అవన్నీ ఆలోచించ దలుచుకోలేదు. పిల్లల్ని ఎత్తుకుపోయేవాడి చెర నుంచి ఎంత వేగిరం తప్పించుకొందామా అని పిల్లవాడు ఆలోచించినట్టే, ఎలాగైనా ఈ చెర నుంచి బయటపడాలనే అనుకున్నాను. “అలాగే,” అన్నాను రైటర్తో, అతను కాగితం తీసుకొస్తానని తన గదివైపు వెళ్లాడు.

అప్పటి నుంచి నిమిష నిమిషం ఎదురుచూస్తూ రెండు గంటలు గడిపాను. ఈపాటికి నాన్న ఇంటికి వచ్చి ఉంటాడు. ‘సుజాత ఏదీ,’ అని వెతుక్కొంటాడు. నా కోసం మరికాసేపట్లో ఇంటికి వెళ్లి ఈ ఎడ్వెంచర్ గురించి అందరికీ చెప్పి సర్‌ప్రైజ్ చెయ్యాలి. తొమ్మిదింటికి అన్నం వచ్చింది. కానీ ఇప్పుడు నాకు అన్నం తినాలని లేదు ఎంత తొందరగా బయటికి వెళ్లిపోతానా అనే ఆతృత. మనసులో ఆలోచనలు సన్నగిల్లుతూ టెన్షన్ పెరుగుతూ ఉంది.

అప్పుడు వచ్చాడు రైటర్, సబ్ ఇన్‌స్పెక్టర్ వెనక మరో ఇద్దరు కానిస్టేబుల్స్‌తో. రైటర్ చేతిలో నా హాండ్ బాగ్ ఉంది. ఎస్.ఐ. చేతిలో ఏవో కాగితాలు. రైటర్ తలుపు దగ్గరగా వచ్చి అన్నాడు.

“చిన్న ప్రాబ్లెమ్ వచ్చిందమ్మాయ్. నిన్ను పంపేద్దుం, కానీ నీ హాండ్ బాగ్‌లో ఒక ఉత్తరం దొరికింది. అది నువ్వు రాసిందే అనుకుంటాను. ఎస్.ఐ.గారు మరి దాన్ని సోదాచేసి చదివారు. అందులో కొంత ప్రమాదకరమైన భాష ఉందిట. మరి నీకూ, కొన్ని ప్రభుత్వ వ్యతిరేక పార్టీలకూ సంబంధం ఉందేమోనని ఆయన అనుమానిస్తున్నారు. అలాంటప్పుడు నిన్ను వదిలేస్తే ఏం ప్రమాదమో అంటున్నారు. నేనంటాను ఆ అమ్మాయి అలాంటిది కాదు, అమాయకురాలు అని మరి నువ్వేమంటావు?”

ఆశ్చర్యపోయాన్నేను. ఆ పైన కుతకుతా ఉడికిపోయాను. అది నేను యూనివర్శిటీ నుంచి ఇంటికి రాక ముందు డాక్టర్ సుధాకర్‌కి రాసిన ఉత్తరం. ఇంటికి ఎలాగూ వస్తున్నాను కదా, పోస్టు చెయ్యడం దేనికి, స్వయంగా ఇద్దామనుకుని హాండ్‌బాగ్‌లోనే ఉంచేశాను. కానీ దానికి కవరుగాని, అడ్రస్‌గాని ఏమీలేవు. సంబోధన కూడా ‘ప్రియమైన స్నేహితుడికి’ అని ఉంటుంది. అంతకన్నా ఏమని ఉంటుంది కనుక? అందులో ప్రమాదకరమైన భాష ఏమిటో నాకు బోధపడలేదు. ఆ మాటే అడిగాను.

“ఏమంటావ్?” సబ్ ఇన్‌స్పెక్టర్ మొహంలో మళ్లీ అదే కర్కశత్వం. “ఈ రాసిందేమిటి?” అటెండరు కూడబలుక్కుంటూ చదివాడతను. “ఈ వ్యవస్థలో ప్రాబల్యం పట్ల, అధికారం పట్ల అందరికీ రుచి. కనుకనే ప్రభుత్వం ఎప్పుడూ తన చేతి నుంచి వాటి పట్టు విడవాలనుకోదు. పూర్వం మనుషులు శ్రమని తమ మధ్య విభజించు కునేవారు. కానీ ఇప్పుడు రాజకీయ శక్తులు శ్రమని, శ్రమని విభజించే మనుషులకి నిర్దేశించి, తాము శ్రమకి అతీతమైన జీవితాన్ని జీవించాలని కోరుకుంటున్నాయి.” ఇంతకు మించి చదవలేకపోయాడు. కానీ ఇందులో ఏముంది? ఒక సోషియాలజీ విద్యార్థిగా ఒక యువ సోషియాలజిస్టుతో ఇంతకన్నా ఏమని రాసుకుంటుంది?

“ఇక్కడ నువ్వు రాసింది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా కాదా?” అడిగాడు రైటర్ ప్రాసిక్యూటర్ స్వరంతో. ఆ రాత్రి ఆ ఇనుప ఊచల వాసన మధ్య, ఆ పాలిపోయిన వెలుతుర్లో, ఆ ఖాకీబట్టల నీడలో, కటకటాల బోనులో నేను కోర్టులన్నింటిలోకి

నిర్దాక్షిణ్యమైన కోర్టులో నిల్చున్నాను.

ఇది నా వ్యక్తిత్వానికి, నా ఉద్వేగాలకీ, నా అనుభూతికి, స్నేహానికీ, నమ్మకాలకి చెందిన విషయం. ఆ మాటలు నేను రాసింది ఒక వ్యక్తికి, ప్రపంచానికి కాదు, వాటి అర్థాల్ని, అంతరార్థాల్ని ప్రశ్నించడానికి వీళ్లెవరు?

"అది నేను ఎవరికీ వ్యతిరేకంగా రాసింది కాదు. అది నిజానికి మనుషులకి వ్యతిరేకంగా రాసింది కాదు. మనుషుల్ని నడిపిస్తున్న కొన్ని 'ఫోర్సెస్'కి వ్యతిరేకంగా రాసింది." అంది.

"నేను చెప్పలేదూ, అదే భాష" సకిలించాడు సబ్ ఇన్స్పెక్టర్.

రైటర్ నాకేసి అనునయంతో చూశాడు. "నీ వాళ్లెవరో చెప్పమ్మా, కబురు చేస్తాం. ఈ ఉత్తరం నువ్వు రాయలేదని చెప్పు.

అత్యాచారి తను అత్యాచారం చెయ్యబోతున్న వాళ్ల నైతిక విలువల మీదుగా ముందుగా దాడి చేస్తాడని నేను ఎక్కడో చదివాను, ఉత్తరం నేను రాసింది కాదనడం నాకు నిజంగా సాధ్యమా?

నా నీతిని కోల్పోలేకపోయాన్నేను.

"అనుభవించు."

జడ్జిమెంట్ ఇచ్చి వెళ్లిపోయాడు రైటర్, అతను ఆ రాత్రి తన చాంబర్‌లోకి వెళ్లిపోతూ నాకు విధించిన శిక్ష ఏమిటి?

సాయంకాలపు సందడి. పట్టణంలో, దీపాలు వెలిగాయి. సినిమాహాళ్ల దగ్గర హడావిడి. తొలి వేసవి సాయం సంధ్య మాధుర్యమంతా గాలుల్లో, ముసురుకున్న చీకట్లలో అల్లుకుంది. జనసమ్మర్దంలోంచి మల్లెలు మత్తెక్కించే గాలులు ఆహ్వానిస్తున్నాయి.

'ప్రోగ్రెసెవ్ ఫోరం' మీటింగ్‌కి వెళ్లాలనిపించ లేదు. ఎందుకో వాళ్లతో కూల్‌గానో, ఎమోషనల్‌గానో ఏదయినా 'డిస్కస్' చెయ్యడమో, 'ఆర్గ్యూ' చెయ్యడమో సాధ్యమనిపించలేదు. ఊరికి దూరంగా నడపడం మొదలు పెట్టాను.

ప్రోగ్రెసివ్ ఫోరం వాళ్లు ఆరంటే ఖచ్చితంగా ఆరింటికే మీటింగ్ మొదలు పెట్టేస్తారు. వాళ్లు మీటింగ్ విషయంలో పాత అలవాట్లని చాలా కావాలని ఒదిలేశారు. కానీ కొత్త అలవాట్లని కావాలని ప్రవేశ పెట్టుకున్నారు. ఇవాళ 'ఇష్టాగోష్టి' సంఘానికి బహుశా ఇద్దరు ముగ్గురు కొత్త సభ్యులు చేరి ఉంటారు. వాళ్లు ఇప్పటికే నావంక క్యూరియస్‌గా చూస్తుంటారు. కార్యదర్శి వాళ్లకు పరిచయం చేస్తాడు. 'ఈమె....' వాళ్లు తలాడిస్తారు. 'అవునవును, అప్పుడు పేపర్లో చదివాం, 'అవునూ, ఇప్పుడు ఇంతకీ ఏం చేస్తున్నారు? కార్యదర్శి దగ్గర ఇంక ఏమీ సమాధానం ఉండదు. అతను ఏమని చెప్పగలడు? 'ఆ తరువాత ఆమె చదువు మానేసి ఇంట్లో ఉండిపోయింది' అనగలడా? కానీ వాస్తవానికి జరిగింది అదేగా, లేకపోతే **'మా అందరి మధ్యా మసలుతూ మాకు ఇనస్పైరింగ్‌గా ఉందని (కొందరు అలా అంటుంటారు) అనగలడా?** నాలో ఇనస్పైర్ చేసేది ఏముంది? నాకు కలిగిన గాయమా? జరిగిన అవమానమా?

నా చుట్టూ ఉన్న ప్రపంచంలో మనుషులంతా కుల, మత, వర్గరహితంగా సుఖ సౌకర్యాల కోసం అహర్నిశలూ తపిస్తూ, ప్రయత్నపడుతూ ఉన్నారు. గాయపడ్డ వాళ్ల నుంచి, అవమానితుల నుంచి, రోగగ్రస్థుల నుంచీ వాళ్లు ఏదన్నా నిజంగా ఉత్తేజం పొందగలరా? కానీ ఆరోగ్యవంతమైన జీవితంపట్ల వాళ్లకున్న ఆరాటాన్ని, అది ఎంత పోటీతో, కుళ్లుతో, యుద్ధంతో కూడుకున్నదైనా సరే, ఎలా నిరసించను? పోనీ 'ఆమె జీవితంలో ఇంత కష్టం అనుభవించి కూడా నిశ్చలంగా ఉన్నది' అంటే వినడానికి ఎంత బాగున్నా నిజంగా అది నిజమా? నేను చలించకుండా ఉన్నానా? – ఆ రాత్రి పదిగంటలు దాటిన తరువాత స్టేషన్లో దీపాలు ఒక్కొక్కటే ఆరిపోయాయి. మగతగా, అలసటగా ఆ గచ్చు మీద అలాగే కళ్లు మూసుకుని ఉన్నాను నేను. ఇంతలో ఇనుపగొళ్లేలు ఒదులయిన చప్పుడు. చప్పుడు చేస్తున్న బూట్లతో ఆ చీకట్లో ఒక ఆకారం నా మీదకి వచ్చి పడింది. కంపించిపోయాన్నేను. అరవనీకుండా నా నోటికి అడ్డుగా ఉప్పని అరచేతులు.

"చచ్చిపోతావే, నీకు బతకాలని లేదే."

గప్పున సారా కంపు, నిప్పు సెగలాగా.

ఆ చేతులు ముందు నా జుట్టుని పట్టుకున్నాయి. జడ ఊడిపోయి నా జుట్టు ముఖమంతా కప్పి మరీ చీకటయింది. ఆ పైన ఆ చేతులు నా ఒంటి మీద తడుములాడాయి. నెమ్మదిగా ఒంటి మీద బట్టల్ని ఊడ్చి వెయ్యడం మొదలుపెట్టాయి.

ఒక మనిషి మీద విధించబడ్డ ఏ నిర్బంధమయినా వాస్తవరూపంలో అతని శరీరం మీద నిర్బంధమే. ఒక మనిషిపట్ల ఉన్న ఏ అసంతృప్తి అయినా, కసి అయినా, జాలి అయినా, అన్నీ వాస్తవరూపంలో అతని శరీరంపట్ల సంవేదనలే నన్ను నిర్బంధించినప్పుడు ఎందుకు గ్రహించలేకపోయాను?

ఆ రాత్రి నా శరీరం మీద జరిగింది నిజంగా ఘాతుకం. ఒకటి వెనుక ఒకటి ఆ పోలీసు మృగాలు నా శరీరాన్ని ధ్వంసం చేసేశాయి. నాకు ఉచ్చ పోసుకోవడానికి కూడా వీలు చిక్కనివ్వలేదు వాళ్లు. నెమ్మదిగా తేరుకునేటప్పటికి నాకు తెలీకుండానే అక్కడ రక్తం స్రవిస్తోంది.

అనేక దినాల పాటు, రాత్రుల పాటు, ఆ తరువాత, ఆ సంఘటన గురించి ఆలోచించాను. వాళ్లు నా పట్ల జరిపిన ఆ అత్యాచారంలో ఉన్న అసలు కారణం ఏది? ఎంత పైశాచికమయినా ఒట్టి గుడ్డి పాశవిక కాంక్ష ఒక్కటే కారణం కాదనిపించింది. ఒక మగవాడి మీద నిర్బంధం బహుశా శారీరక చిత్రహింస దాకా పర్యవసిస్తుంది. అదే ఒక స్త్రీ అయితే అది అత్యాచారం

దాకా కొనసాగుతుంది. **ఆ అత్యాచారాన్ని నేను కాముకమైన ఘాతుకంగా మటుకే చూడలేకపోతున్నాను.** అది తీవ్రాతి తీవ్రమయిన నిర్బంధం. దారుణమైన శారీరక చిత్రహింసానూ. నామీద అత్యాచారం చేసింది మనుషులే. వాళ్లు పోలీసులే కనుక వాళ్లకా వీలు చిక్కడం అన్నది తరువాత సంగతి.

ఎంత జంతువునయినా రెండు తప్పుల వరకు క్షమించగలం. నన్ను నిర్బంధించినందుకు, నా మీద అత్యాచారం జరిపినందుకు కూడా నేను పూర్తిగా నశించలేదు. కానీ రెండవరోజు మధ్యాహ్నం సర్కిల్ ఇన్ స్పెక్టర్ నన్ను చూడడానికి వచ్చాడు. "ఎవరో నీ గురించి హెబియస్ కార్పస్' ఫైల్ చేశారని తెలిసింది. నీకు చాలా అండదండలున్నాయన్నమాట," అన్నాడు. అప్పుడే నా గురించి బయట ప్రయత్నాలు జరుగుతున్నాయని తెలుసుకున్నాను. వాళ్లు నన్ను స్టేషన్ నుంచి స్టేషను మార్చారు. చివరికి బయట ఒత్తిడికి తట్టుకోలేక సెక్షన్ 120 కింద నేరారోపణ చేసి మేజిస్ట్రేట్ ముందు హాజరు పర్చారు. వాళ్లకున్న ఏకైక ఆధారం నేను రాసిన పోస్టు చెయ్యని ఉత్తరం. మేజిస్ట్రేట్ నాకు రెండు వారాల రిమాండ్ విధించాడు. నన్ను సెంట్రల్ జైలుకు పంపారు.

అరెస్టు చేసినది మునిసిపల్ ఇంజనీర్ గారి అమ్మాయి? అని తెలిశాక మునిసిపల్ ఛైర్మన్ ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నాడు. ఆయన పెద్ద ఎత్తున జిల్లా రాజకీయ వర్గాలతో కలిసి హోం మినిస్టర్ మీద ఒత్తిడి తీసుకొచ్చాడు. బయట 'ప్రోగ్రెసివ్ ఫోరం' వాళ్ల కృషి వల్ల ప్రజలు, పత్రికలు, పౌరహక్కుల సంఘాలు పెద్ద ఉద్యమం చేపట్టాయి. ఈ సంఘటనకు కారకులయిన పోలీసుల్ని సస్పెండ్ చేశారు. పది రోజుల తరువాత నాన్న నన్ను బెయిల్ మీద విడిపించడానికి జైలుకు వచ్చాడు. ఆరోజు ఆయన్ని చూడడం నిజంగా ఒక అనుభవం. ఆయన నన్ను అసహ్యించుకుంటాడనుకున్నాను. ఆయన నా పట్ల ఎలాంటి భావాన్ని వ్యక్తం చెయ్యలేదు.

బహుశా, ఏక్సిడెంట్ జరిగింది, చెయ్యి పోయింది. చాలా ముఖ్యమైన భాగం కానీ ఏం చెయ్యగలం? ప్రాణాల్తో బతికేం కదా. చాలు.

తర్వాత నేను ఎప్పటిలా యూనివర్సిటీలో చదువుకోవాలని ప్రయత్నించాను. సాధ్యం కాలేదు. ఎవరో నన్ను హేళనగా చూస్తున్నారనీ, సానుభూతి కురిపిస్తున్నారనీ కాదు. ఒకరి సానుభూతి కానీ, ఒకరి ద్వేషం కానీ నిజంగా నన్ను కదిలించలేవు



ఇప్పుడు. 'ఇంతకీ ఆ ఉత్తరం ఎవరికి రాశావు?' అని అడిగాడు డాక్టర్ సుధాకర్ నన్ను చూడడానికి వచ్చినప్పుడు.

....బాగా చీకటి పడింది. ఎక్కడయినా పార్క్‌లో కూచుంటే బాగుణ్ను అన్పించింది. 'ప్రొగ్రెసివ్ ఫోరం' మీటింగ్ ఈ పాటికి ముగింపుకి వచ్చి ఉంటుంది. "నా అనంతర జీవితం ఎలా ఉండాలి? ఈ ప్రశ్న అందర్నీ ఏదో ఒక మూల బాధ పెడుతూనే వుంది. యూనివర్శిటీలో చదువుకుంటున్నప్పుడు 'నా అనంతర జీవితం ఎలా ఉండాలి?' అని ఎవరూ భావించలేదు. బహుశా అమ్మా, నాన్న, ఒకరిద్దరూ తప్ప. కానీ అప్పుడేనా వారు బహుశా నా పెళ్లి వరకూ ఆలోచించి వుంటారు. ఆ తర్వాతైనా 'నా అనంతర జీవితం ఎలా ఉండాలి?' అని ఎవరు ఆలోచిస్తారు? నా భర్త ఆలోచించడు. ఆ ప్రశ్న అతనికి అనవసరమైనదిగా ఉంటుంది.

ప్రోగ్రెసివ్ ఫోరం' వాళ్లు కూడా ఈ విషయాన్నే ఇవాళ అనేక విధాలుగా చర్చించి ఉందురు. బహుశా నా పరోక్షంలో చర్చించే ఉంటారు. నేను ఇప్పుడు అందరిలాగా మామూలు జీవితానికి అర్హురాల్ని కాదనే చాలామంది నమ్మకం. అలాగని 'మామూలు జీవితానికి నేను మటుకు ఎందుకు అర్హురాలిని కాకూడదు? అని వాదిస్తారు. అయినప్పటికీ నేను ఎలాగయినా ఇక నుంచీ నా అనుభవాల ఆధారంగా వేరే జీవితం కోసం 'కృషి' చేస్తే బాగుంటుందని సూచిస్తారు.

'ప్రోగ్రెసివ్ ఫోరం' వాళ్లని నేను ఇష్టపడతాను. ఈ సమాజంలో నాకున్న ఆత్మీయులు వాళ్లే. నా అనుభవాన్ని సీరియస్‌గా తీసుకునేది వాళ్లే. మంచి జీవితం కోసం వాళ్ల ప్రయత్నం నన్నెప్పుడూ ముగ్దురాల్ని చేస్తుంది. కానీ **నా పైన జరిగిన అత్యాచారం 'నా పైన మటుకే జరిగిన అత్యాచారంగా వాళ్లు భావిస్తారు. అది నా ఒక్కర్తి పైనే జరిగిందా? కాదు. అది నీ మీదా, నా మీదా, ప్రతి ఒక్కరి ఆశలమీదా, స్వేచ్ఛ మీదా, ఆనందం మీదా, స్వప్నాలమీదా జరిగింది. అది పోలీసుల వల్లనే జరిగిందా? ఎదుటి మనిషి జీవితాన్ని శాసించాలని చూసే ప్రతి ఒకళ్ల వల్ల జరిగింది.**

అలాగని వాళ్లు తమ జీవితానందాల్నీ, వ్యక్తిగత సౌకర్యాల్నీ ఒదులుకోవాలని

కోరుకుంటున్నానా? లేక నేనేదో అట్లాంటి జీవితాన్ని కోల్పోయానని చింతిస్తున్నానా? మనుషులు కోరుకునే సుఖమయమైన జీవితం ఎలాంటిదో నేను రోజూ మా తమ్ముడి, మరదలి విషయంలో చూస్తూనే ఉన్నాను....

ఇంటికి చేరేసరికి బాగా చీకటి పడింది. పెళ్లి వారు వెళ్లిపోయినట్టున్నారు. ఎవరినీ పలకరించకుండా మేడ మీదకు వెళ్లిపోయాను. చెల్లెలిని చదువు మాన్పించయినా సరే, పెళ్లి చేసెయ్యాలని నాన్న పట్టుదల. ఇందుకోసం ఆయన ఎంత ఖర్చుకైనా వెనుదీసేట్టు లేదు.

అమ్మ ఏమనుకుందోగాని రాత్రి భోజనం మేడ మీదకే తీసుకువచ్చింది. ప్రాపంచిక విలువలో పీకల దాకా కూరుకుని ఉన్న మనిషి ఆమె. కానీ తన పెద్ద కూతురిని చూసేటప్పటికి విలువలకి అతీతమైన ప్రేమ పొంగుతుంది ఆమెలో. నేను ఉదయం నుంచీ అణుచుకున్న టెన్షన్‌ని భరించలేకపోయాను. సుభద్ర జీవితం భద్రంగా వుండడం కన్నా నాకు కావలసిందేముంది?

"పెళ్లివారు నా గురించి ఏమన్నా అడిగారా అమ్మ."

అమ్మ నాకేసి కళ్లెత్తి ఆశ్చర్యంగా చూసింది. ఆపైన బాధని అణచుకోలేక పోయింది. కొంతసేపు ఏడ్చింది. ఆపైన నెమ్మదిగా అంది. "ముందు ఏమీ ప్రస్తావించ లేదు. చివర్లో పెళ్లికొడుకు తండ్రి అన్నాడు మీ నాన్నగారితోటి, పెద్దమ్మాయి గురించి మేం విన్నాం, జరిగిన దానికి మనం ఏం చేయగలం? మీరు విచారపడకండి. అది మన దురదృష్టం అంతే. ఇంతకీ అమ్మాయి కనిపించదేం, అని అడిగాడు.

'మీకు కన్పించలేక సాయంకాలం బయటికి ఎక్కడకో వెళ్లింది, అన్నారు మీ నాన్నగారు.

'అయ్యో అదేమిటి! లేచిపోయిన మనిషా ఏమిటి, తప్పించుకు తిరగడానికి, అన్నాడు అతగాడి తండ్రి."

'లేచిపోయిన మనిషి విలువల స్వరూపం నాకు బాగా బోధపడ్డట్టు అయింది. అమ్మ వెళ్లిపోతూండగా అడిగాను. "కట్నం ఏమాత్రం అడిగారు?"

"ఇదివరకటి మాటలే అనుకో. అయితే, బహుశా మరో పదివేలు ఎక్కువడుగుతారేమో అంటున్నారు ఆయన."

రాత్రి పడుకోబోయే ముందు చాలాకాలం క్రితం నేను చూసిన దృశ్యం ఒకటి గుర్తొచ్చింది. ఒకరోజు నేను రిక్షాలో కాలేజి నుంచి వస్తున్నాను రైలు గేటు పడింది. అటూ ఇటూ చాలా వాహనాలు ఆగిపోయి ఉన్నాయి. గేటు చాలాసేపటి నుంచీ వేసి ఉంది. మేమాగిన ఎంతో సేపటికిగానీ రైలు రాలేదు. విసుగుతో, అసహనంతో ఉన్న నాకు రైలు గేటు ఇవతల కమ్మీల మీద కొంత మంది చిన్నపిల్లలు కూచుని కనబడ్డారు. అప్పుడు నేను వాళ్లనంత పట్టించుకోలేదు. ఇంతలో ఇనుప నాగరికతా మహాయుగాల ప్రతినిధిగా చప్పుడు చేసుకుంటూ విపరీతమైన వేగంతో గూడ్స్ రైలు నా కళ్ల ముందు పట్టాల మీద సాగిపోయింది. దాని అదురుకి భూమి దద్దరిల్లుతూనే ఉంది. అప్పుడు చూశాను. పిల్లలు ఆ రైలుకి చేతులెత్తి వీడ్కోలు చెప్తున్నారు. రైలు వెళ్లిపోగానే, వాళ్లు అందుకోసమే అప్పటి దాకా ఆగినట్టుగా లేచి వెళ్లిపోయారు. అటూ ఇటూ వాహనాలు ముందుకు కదిలాయి.

ఆ దృశ్యంలో నన్ను ఏది ఆకర్షించిందో నాకు తెలయదు. కానీ, కనీసం ఈ క్షణాన 'నా అనంతర జీవితం ఎలా? అన్న నా ప్రశ్న హాస్యాస్పదంగా అనిపించింది.

**(సమాప్తం)**

## స్కూల్‌కి రూ. 50 లక్షల పొలాన్ని దానమిచ్చిన రైతు



అక్కడ ఆడపిల్లలు చదువుకోవడమంటే, ప్రాణాలతో ఆటలాడుకోవడమే, అలాగని చదువుకోకపోతే బాల్య వివాహానికి బలవ్వాల్సిందే. అందుకే ఆ చిన్నారుల భవిష్యత్తును మార్చేందుకు ఓ రైతు రూ. 50 లక్షలు ఖరీదైన తన పొలాన్ని స్కూలుకి దానమిచ్చేశాడు ఆఫ్ఘనిస్థాన్‌లోని జలాలాబాద్‌లో వకీషా అనే వ్యక్తి వ్యవసాయం చేస్తుంటాడు. అతనికి చదువు లేకపోయిన ఆ ఊరి పిల్లలంతా చదువుకోవాలని ముఖ్యంగా ఆడపిల్లలు తప్పకుండా చదువుకోవాలనేది ఆయన ఆకాంక్ష. అందుకని రూ. 50 లక్షలు విలువ చేసే తన పొలాన్ని పాఠశాల నిర్మాణానికి ఇచ్చాడు. దీనికి ప్రభుత్వం కూడా ప్రోత్సహించడంతో చకచక పాఠశాల నిర్మాణం జరిగిపోతోంది. వచ్చే ఏడాది దీన్ని ప్రారంభించనున్నట్లు సమాచారం. అక్కడ కాగితాల్లో 18 వేల బడులు ఉన్నట్లు లెక్కలు ఉన్నా అవి నిర్మాణంలో లేకపోవడం అక్కడి రాజకీయ నాయకుల అవినీతికి తార్కాణంగా చెప్పుకోవచ్చు. ఇక్కడ చదువు లేని విద్యార్థుల్లో 60 శాతం మంది బాలికలు వుండడం గమనార్హం. ఆడపిల్లలు చదువుకొని డాక్టర్లు, టీచర్లు అయ్యి వేరే పిల్లలకు పాఠాలు చెప్పాలని వకీషా అకాంక్షించారు.

డాక్టర్ బి. మధుసూదనరావు

మెనోపాజ్

# రుతురాహిత్యం



## బాల్యం, కౌమారం, యవ్వనం జరా...

**(మనిషి జీవితంలో బాల్యమూ, కౌమారమూ, యవ్వనమూ ఏర్పడటం అనివార్యం)**

బాల్యం, కౌమారం, యవ్వనం, వృద్ధాప్యం... ఈ దశల్లో మన జీవన చక్రం సాగుతుంది. పుట్టినప్పటి నుంచీ 12 ఏళు వచ్చేవరకూ బాల్యం అనీ, చిన్నతనం అనీ అంటాము. ఈ దశలో మగ పిల్లలూ, ఆడ పిల్లలూ ఒకే రకంగా వుంటారు. శారీరక తేడాలు పెద్దగా కనిపించవు. ఈ దశలో పిల్లల శరీరంలో కనిపించే మార్పు... అన్ని అవయవాల్లోనూ పెరుగుదల ఒక్కటే.

**కౌమారదశ :** బాల్యదశ దాటిన తరువాత కౌమార దశ ప్రవేశిస్తుంది. ఈ దశలో శరీరంలో అనేక మార్పులు చోటుచేసుకుంటాయి. ముఖ్యంగా శరీరంలో సంతానోత్పత్తికి సంబంధించిన అవయవాల పెరుగుదల కనిపిస్తుంది. అంటే ఎత్తు పెరగటం, జననేంద్రియాలు సంతానోత్పత్తికి వీలుగా మార్పు చెందటం (అమ్మాయిల్లో ఈ మార్పులు అబ్బాయిల కంటే ఏడాది ముందుగా ప్రారంభం అవుతాయి) పురుష, స్త్రీ శరీరాకృతి స్పష్టంగా ఏర్పడుతుంది. ఇది తెలిసీ తెలియని వయస్సు అని చెప్పుకోవచ్చు. బాల్యదశ తరువాత 16వ సంవత్సరం వరకూ కౌమార దశగా పరిగణిస్తారు.

**యవ్వనదశ :** యవ్వన దశ 16 ఏళ్ల తదుపరి మొదలవుతుంది. ఈ దశలోనూ శారీరక మార్పులు కొనసాగుతాయి. అవయవాల పెరుగుదల పరిపక్వ దశకు వస్తుంది. వైవాహిక జీవితం మొదలు పెట్టేందుకు అనువయిన కాలం ఇదే. సంతానోత్పత్తికి యువతీయువకులు శారీరకంగానూ, మానసికంగానూ సంసిద్ధమయి వుంటారు. రుతుచక్రం వలన అండాశయం నుంచి అండం తయారయి సంతానోత్పత్తికి తోడ్పడుతుంది. హార్మోనులు విడుదలయి శరీర మార్పులకు దోహదపడతాయి.

నడివయస్సులో సుమారు 46 ఏళ్లకు మనదేశంలో స్త్రీలలో రుతుచక్రం ఆగిపోతుంది. దీనినే రుతురాహిత్యం, రుతు రహితం అని కూడా అంటారు. అంటే ఇక అండము విడుదల జరగదు. హార్మోనుల తయారీ కూడా తగ్గిపోతుంది. రుతుచక్ర కాలంలో హార్మోనుల వలన వచ్చిన శారీరక మార్పులు సడలుతాయి. కొన్ని మార్పులు కొంతమేర వెనుకకు మరలుతాయి. వీటివలన కొన్ని శారీరక సమస్యలు మొదలవుతాయి. కొన్ని సమస్యలు జబ్బులకు దారితీస్తాయి. సమస్యలను నివారించటానికి పద్ధతులు వున్నాయి.

చివరి బహిస్టు రావటంతో రుతు రాహిత్యం మొదలవుతుంది. అయితే ఈ స్థితి వున్నపళంగా రాదు. దీనికి సంబంధించిన మార్పులు చివరి బహిస్టు కంటే నాలుగయిదేళ్లకు ముందు నుంచే ప్రారంభమవుతాయి. బహిస్టు ఆగే ఏడాదిలో ఎక్కువగా వుంటాయి. ఇవన్నీ హార్మోనుల వుత్పత్తిలో హెచ్చు తగ్గుల వలన సంభవిస్తాయి. చివరి బహిస్టు తర్వాత కూడా ఈ మార్పులు కొనసాగుతాయి. చివరి బహిస్టు తర్వాత నాలుగయిదు ఏళ్లకు హార్మోన్ల విడుదల పూర్తిగా ఆగిపోతుంది. ఈ దశలో హార్మోన్ల మార్పులకు తోడుగా ఆరవై ఏళ్ల తర్వాత వచ్చే వృద్ధాప్యపు మార్పులు తోడవుతాయి.

రుతురాహిత్యం అన్ని దేశాలలో ఒకే వయస్సులో జరగటం లేదు. అమెరికా, ఐరాపా తదితర దేశాల్లో 51 ఏళ్ల తర్వాత వస్తున్నది. రుతురాహిత్యం ఆయా దేశాలలో సాధారణ అలవాట్లు, సాంస్కృతిక జీవన విధానం మీద ఆధారపడుతుంది. జపానులో, చైనాలో కూడా వారి ఆహారపు అలవాట్ల వలన 50 ఏళ్లు పైబడిన వారిలోనే రుతు రాహిత్యం చోటుచేసుకుంటున్నది.

చివరి బహిస్టుకు ముందు, తరువాత శరీరంలో వచ్చే హార్మోనుల హెచ్చుతగ్గుల వలన శారీరక మార్పులు, సమస్యలు వస్తాయనుకున్నాము. కనుక ఇది సహజంగా జరిగే మార్పు తప్ప జబ్బు కాదు.

రుతుక్రమం ఆగిపోగానే కొందరు అంతా అయిపోయిందని భావిస్తారు. ఇక తాము కృష్ణా, రామా అంటూ కూర్చోవటమేనని

అనుకుంటారు. వారి ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపరు. నిజానికి దీనిని ఒక అవకాశంగా భావించాలి. శరీరంలో వచ్చిన మార్పులను అర్థం చేసుకోవాలి. జీవన శైలిలో అవస రమయిన మార్పులను చేసు కోవాలి. అంటే ఆహారం, వ్యాయామంలో మార్పులు చేసుకోవాలి. అవసరమయితే వైద్యుడితో సలహాలు తీసుకోవాలి. ఇందు కోసం మీ కోసమంటూ కొంత సమయాన్ని కేటాయించు కోవాలి. ఈ మార్పులు సహజంగా చివరి బహిష్టుకు ముందు సంవత్సరాలలో వస్తాయి.

తర్వాత రోజులలో జననేంద్రియ సమస్యలు, మూత్ర సంబంధిత సమస్యలు ఎక్కువగా కనిపిస్తాయి.

తరువాతి క్రమంలో నిద్రలేమి సమస్యలు, మానసిక మార్పులు (చిరాకు, దిగులు, విచారం, మతిమరుపు వంటివి) తలెత్తుతాయి.

చర్మం పొడిబారటం, ముడుతలు రావటం, వెంట్రుకలు రాలటం (పల్చబడటం) వెంట్రుకలు లేని చోట్ల పెరగటం వంటి సమస్యలు తలెత్తుతాయి.

కొందరిలో శృంగారం (సంభోగంలో) వ్యవహారంలో సమస్యలు చోటుచేసుకుంటాయి.

వొళ్లు నొప్పులు, కీళ్ల నొప్పులు, కూడా ఎక్కువమందిలో కనిపిస్తాయి.

ఇవేకాక పంటి, కంటి సమస్యలు, మెదడు, గుండె సంబంధిత వ్యాధులు, మధుమేహం, రొమ్ములలో వచ్చే సమస్యలు, క్యాన్సరు తదితర వ్యాధులకు గురి కావచ్చు. అందువలన వీటన్నింటి పట్ల ప్రాథమిక అవగాహన చేసుకోవాలి. వీటి నివారణకుగాను సకాలంలో జాగ్రత్తలు తీసుకోవాలి.

అంటే రుతురాహిత్య కాలంలో ప్రతి అవయవ వ్యవస్థలోనూ మార్పులు రావటం, వ్యాధులు సోకటం జరగవచ్చు.

వీటన్నింటి గురించీ ముందు ముందు విపులంగా తెలుసుకుందాం. అంటే ఆహారంలో తీసుకోవలసిన మార్పుల వలనా, వ్యాయామం వలనా కలిగే ప్రయోజనాలను స్థూలంగా తెలుసుకుంటే సమస్యలను కొంతమేర స్వయంగా పరిష్కరించుకునే వీలుంటుంది. యోగ, ఆయుర్వేదం వంటి వాటివలన ప్రయోజనాలను తెలుసుకుందాం. యవ్వనంగా కనిపించటానికి అవసరమయిన మందుల, శస్త్రచికిత్సల వివరాలను చర్చిద్దాం. ప్రయాణ సమయంలో తీసుకోవలసిన జాగ్రత్తలను గుర్తిద్దాం. రుతురాహిత్యంలో తలెత్తే అనారోగ్య సమస్యల పరిష్కారానికి వున్న బీమా (ఇన్స్యూరెన్స్) సౌకర్యాలనూ, వైద్యానికి పెట్టవలసిన ఖర్చులు వంటివి ముందు ముందు వివరంగా తెలుసుకుందాం.

(వచ్చే సంచికలో గుండె దడ ధడ ! వేడి వేడి ఆవిర్లు !!)

– డాక్టర్ బీ. మధుసూదనరావు
MBBS, MD,CIMP, మెనోపాజ్ నిపుణులు,
హైదరాబాదు, సెల్ :8985175855


కార్టూనిజం


లంచం డబ్బుతో పాటు పది నోట్ కౌంటింగ్
మెషిన్లు కూడా అదనంగా ఇవ్వాలట..
పైపెచ్చు నోట్లు లెక్క పెట్టటానికి అలవెన్సులు
ఇస్తేనే మన ఫైలు మీద సంతకం చేస్తాడట..
CASH


గంగులూ! ఈ నర్సింగ్ గాడు ఎవడో? బిల్డింగ్‌లన్నీ
హాస్పిటల్స్‌కి రెంట్‌కిచ్చి చాలా సంపాదిస్తున్నాడు. వాడు
ఏ ఇంట్లో ఉంటాడో కనిపెడితే మనకు నిధి దొరికినట్టేరా!


బి నెగిటివ్ రక్తం దొరక్క దొరికితే
మనకులపోడిది కాదు నేనెక్కించుకోను
అన్నాడ్రా మీ బావ... దాంతో తేడైపోయిం...


హైదారాబాద్‌లో తంతే
అమరావతిలో పడ్డాం ఇప్పుడు మళ్లీనా...!?


అమరావతిలో భూమి మిగల్లేదు ..
అందుకే వైజాగ్ వైపు పరుగులు..



# న్యూజిలాండ్ కోవిడ్ -19 ఫ్రీ కంట్రీ

అక్కడ ఆవు మూత్రం తాగలేదు ...!
అక్కడ ఆవు పేడ పూసుకోలేదు ...!
అక్కడ చప్పట్లు, కంచాలు - గరిటెలు - గంటలు వాయించి శబ్ద తరంగాలు పంపలేదు!
అక్కడ కోట్లాది మంది ప్రజలు దీపాలు పెట్టి టపాసులు కాల్చి కాంతి తరంగాలు విడుదల చేయలేదు ...!
అక్కడ కాగడాలు చేతబూని ప్రదర్శనలు చేయలేదు ...!
అక్కడ నరబలి ఇవ్వలేదు...!
అక్కడ వ్యాధినిరోధక శక్తి పెంచుతాయంటున్న గుళికలను పంచిపెట్టలేదు...!
అక్కడ ఆవ నూనెను ముక్కులో పోయలేదు...!
అక్కడ మనం రోజూ తీసుకునే ఆహారం నుంచి కొన్ని పదార్థాలని (అల్లం బెల్లం) వేరు చేసి అవే మందు అని ప్రచారం చేయలేదు ...!
అక్కడా కేసులుండేవి ...!
అక్కడా కొందరు చనిపోయారు ...!
కానీ నేడు న్యూజిలాండ్ కోవిడ్ - 19 ఫ్రీ కంట్రీ ....గుణపాఠం ఏమంటే...
మనం చేయాల్సినవన్నీ పక్కన పెట్టి, చేయకూడనివి అన్నీ చేసి, ప్రపంచానికి ఏదో నిరూపించేద్దాం అనుకుని, బోర్లా పడిపోయాం ...!
అందుకని మూఢనమ్మకాలు వీడండి అంటువ్యాధులపై వైరస్‌లపై అవగాహన పెంచుకుందాం!
జాగ్రత్తలు పాటిద్దాం!
జనాన్ని బతికించుకోవాలని ప్రగాఢంగా కోరుకుంటున్న శాస్త్రవేత్తలనూ, వారి విజ్ఞానాన్ని గుర్తిద్దాం! వాటినే అనుసరిద్దాం!!

---

# మెహెందీ బజార్

**(అక్కడ నాన్నల్లేని పిల్లల కోసం ఓ పిల్లాడి ఆవేదన ఇలా...!)**

**- అమూల్య చందు**



మా ఇంటికీ, మా వీధిలోనూ...
అమ్మలు మాత్రమే పరిచయం
నాన్నను పిలుద్దామంటే ...
ఎవరో తెలీదు!
మల్లెపూలతో...
రాత్రుల్లో కనిపించే ఆకారాలు తప్ప
నాన్న అనే ప్రాణమే తెలీదు!
టీవీలో ఎడారిని చూసినప్పుడు
నాన్న లేని మా ఇల్లే గుర్తొస్తుంది
అమ్మను అడగాలనిపిస్తుంది...
కానీ ఎండిపోయి రాళ్లు తేలిన
చెరువు లాంటి పెదాల మధ్య
ఎర్రని లావా
బయటపడుతుందని భయం...!
వర్షం వచ్చే ముందు గర్జించే ఆకాశంలా
అమ్మ నామీద అరిచినప్పుడు
ఎక్కడి నుంచైనా నాన్న హీమాన్
వచ్చి... వీపు మీద
తీసుకెళ్లిపోతే బాగుండనిపిస్తుంది
కానీ మా ఇంటికి నాన్న
అనే పదమే తెలీదు
నా నలుపును ఎవరైనా
అసహ్యించుకున్నప్పుడల్లా
మా నాన్న రంగు నాది
చందమామను మెరిపించే
చీకటి రంగని అరవాలనిపించేది
మా వీధుల్లోని అణువణువూ
అమ్మలకే పరిచయం
నాన్నల్లేని ఎన్ని ఒంటరి
అరుగులో మా బస్తీలో...!
నాకు ఏడుపు రాదు
ఆకలి కూడా వేయదు
నాన్న వచ్చి నన్ను ఓదార్చి
అన్నం పెట్టడని తెలుసు
అమ్మంటే నాకెపుడూ
చిన్న చూపు లేదు
నాన్న ...
ఎప్పటికీ నిలిచిపోయే జ్ఞాపకం కదా
అని బాధతప్ప...!

మహిళలు - సోషలిజం

# సంస్కరణోద్యమం



మధ్యయుగాలలో ఆరోగ్యకరమయిన ఇంద్రియలాలస భావనకు లూథర్ ఉత్తమ ప్రతినిధి. క్రైస్తవ సన్యాసినుల – సన్యాసుల జీవితాలు ప్రకృతి నియమాలకు ఎంత విరుద్ధమో ఒకప్పటి రోమన్ మతాధికారిగా లూథర్‌కు బాగా తెలుసు. అందుకే వాళ్ల బ్రహ్మచర్యాన్ని ఆయన సూటిగా ఖండించాడు. ఒక ఆరోగ్యవంతమైన స్త్రీకి పురుషత్వం లేని వ్యక్తితో పెళ్లి జరిగితే అతన్ని వదిలేసి, తిరిగి పెళ్లి చేసుకునే హక్కు ఆమెకు వుంది. అలాగే ఒక స్త్రీ తన వైవాహిక ధర్మం నిర్వర్తించకపోతే మరో మహిళ దగ్గరకు వెళ్లే హక్కు పురుషుడికి వుంటుంది. కాకపోతే ఈ విషయాన్ని ముందుగా వారి భాగస్వాములకు తెలపాలి అంటాడు లూథర్. లౌక్యం, వంచన నిండిన మన కాలపు దృక్పథం నుంచి చూస్తే ఈ సంఘ సంస్కర్త అభిప్రాయాలు విడ్డూరంగానూ, అవినీతిమయంగానూ కనిపిస్తాయి.

మధ్యయుగాల రైతులు వారసులను కనేందుకే వివాహం చేసుకునేవారు. ఒక వేళ పిల్లలు కలుగకపోతే ఆ ఆచరణ వాదులు నైతికతను పట్టించుకోకుండా ఆ బాధ్యతను వేరొకరికి అప్పగించేవారు. అవసరం తీరడమే ముఖ్యమనుకునేవారు. ఆస్థిని మనిషి అదుపు చేయలేడు. ఆస్థే మనిషిని అదుపు చేస్తుంది. ప్రొటెస్టెంట్ల రాజ్యాలలో మత పెద్దల బ్రహ్మచర్యాన్ని, క్రైస్తవ మతాలనూ రద్దు చేసిన నేపథ్యంలో సంస్కరణల ద్వారా వేలాది మంది స్త్రీ పురుషులకు తమ సహజ వాంఛలను న్యాయబద్ధంగా తీర్చుకునే వీలుకల్పించాడు లూథర్. కానీ ఈ అవకాశం అన్ని వర్గాలకూ వర్తించలేదు. ఆర్థిక హోదాపై ఆధారపడి ఆ చట్టాలు అమలయ్యేవి. వివాహ స్వేచ్ఛ గురించి లూథర్ మాట్లాడినది కేవలం బూర్జువాల వివాహం గురించే. కానీ దాన్ని మన కాలపు పౌర వివాహ చట్టాలు నిజం చేశాయి. వలస, వృత్తి, నివాస విషయాలలో స్వేచ్ఛ లభించింది. సంస్కరణలు చాలా మందికి పెళ్లి చేసుకునేందుకు వీలు కల్పించగా, మరొకవైపు విచ్చలవిడి లైంగిక సంబంధాలకు కఠిన శిక్షలు విధించారు. విశృంఖల లైంగిక సంబంధాలపట్ల కేథలిక్ మత పెద్దలు కొంత వరకూ సహనం వహించారు. కానీ ప్రొటెస్టెంట్లు మాత్రం దాన్ని వ్యతిరేకించారు. దారి తప్పిన స్త్రీలను దుర్మార్గానికి పరాకాష్టగా భావించి తీవ్రంగా హింసించారు. మధ్య యుగాల కేథలిక్ మతం ఆదరించిన ఇంద్రియలోలత్వాన్ని ఇష్టపడని చట్ట బద్ధమైన భార్యలకు ఈ ప్రొటెస్టెంట్ల భావన బాగా నచ్చింది.

**అమెరికాకూ భారతదేశానికీ మధ్య మార్గాన్ని కనుక్కోవటంతో ఉత్పత్తి, వస్తు మారకం, ద్రవ్యరంగాల పరిస్థితి మారిపోయింది. జర్మనీలో పెద్ద ఎత్తున సామాజిక మార్పులు తలెత్తాయి. వాణిజ్యానికి జర్మనీ కేంద్రంగా ఉండే అవకాశం లేకపోయింది. జర్మనీలో వాణిజ్యం, ఉత్పత్తి క్షీణించాయి. మతసంస్కరణలు దేశ రాజకీయ ఐక్యతను నాశనం చేశాయి. పేదరికం పెరిగింది.**

**మత ఘర్షణలనూ, హింసనూ తమ రాజకీయ ఆర్థిక ప్రయోజనాల కోసం రాజవంశీయులు ఉపయోగించుకోవడం వల్ల జర్మనీలో దాదాపు వంద సంవత్సరాలు చెలరేగి చివరకు '30 సంవత్సరాల' యుద్ధంతో ఘర్షణలు అంతమయ్యాయి.** వందల సంఖ్యలో పట్టణాలు, పల్లెలు నాశనమయ్యాయి. వాటిలో చాలా వరకూ జనాభా తగ్గిపోయింది. ఇటువంటి పరిస్థితుల్లో పట్టణాలలో, పల్లెల్లో జనాభాను పెంచడానికి బహుభార్యత్వం ఆమోదించడం వంటి విపరీత నిర్ణయాలు జరిగాయి. కారణమేమంటే మగవారి జనాభా తగ్గి, స్త్రీల సంఖ్య పెరగడం. ఈ పరిస్థితుల్లో 1650 ఫిబ్రవరి 14న న్యూరెంబర్గ్‌లో ఫ్రాంకోనియం జిల్లా మండలి ఆదేశాలు ఇలా ఉన్నాయి – 60 ఏళ్ల కంటే తక్కువ వయసు పురుషులను క్రైస్తవ మఠాల్లోకి అనుమతించరు. ఏ దీక్షల్లోనూ సభ్యులు కాని మతాధికారులు తప్పనిసరిగా పెళ్లి చేసుకోవాలి. ఇద్దరు భార్యలను పెళ్లాడడానికి ప్రతి పురుషునికీ అనుమతి ఉంది. ఇద్దరు స్త్రీలను పెళ్లి చేసుకున్న భర్త వారిద్దరినీ బాగా చూసుకోవాలి. విభేదాలు రానివ్వకూడదు.

# గురజాడ అపార్ట్‌మెంట్స్



సంజీవప్ప రైలు దిగి, స్టేషన్ నుంచి బయటకు రాగానే, ఆటోడ్రైవర్లు మూగి "ఎక్కడికి పెద్దాయనా" అని అడిగినారు.

"ఎక్కడికి వెళ్లేది తర్వాత చెబుతాను. ఏ ఆటో ఎక్కాలో ముందు మీరు చెప్పండి" అన్నాడు, ఆ ఏడు పదుల పెద్దాయన!

"కూచో పెద్దాయనా" అంటూ ఒక డ్రైవర్, అతని చేతిలోని సూట్‌కేస్ అందుకున్నాడు. సంజీవప్ప ఆటోలో కూర్చుని "విజయనగర్ కాలనీ" అన్నాడు.

"కాలనీలో ఎక్కడ పెద్దాయనా?"

"పెట్రోల్ బంక్ పక్కన వినాయక అపార్ట్‌మెంట్స్. నేనూ చూడలేదు, కొత్తగా కట్టినారట. మా అన్న కూతురుంది అక్కడ" అన్నాడు.

"చాలా దూరం పెద్దాయనా.. నూరు రూపాయలివ్వండి" అన్నాడు ఆటోడ్రైవర్.

"అలాగే ఇస్తాను పద నాయనా" అన్నాడు. ఆటో వాళ్లతో సాధారణంగా బేరమాడడు. కష్టాన్ని నమ్ముకొని బతికేవాళ్లు. రైల్వేస్టేషన్ దగ్గర ప్యాసింజర్ల కోసం గంటల తరబడీ కాచుకొని వుంటారు. వాళ్లతో బేరమాడటమంటే ఏదో గిల్టీనెస్ ఫీలవుతాడు సంజీవప్ప. అరగంట తర్వాత అపార్ట్‌మెంట్ ముందు ఆగింది ఆటో. అప్పటికే సంజీవప్ప అన్న కూతురు రాజ్యలక్ష్మి గేట్ ముందు నిల్చుని వుంది. అప్పటికి బాగా తెల్లవారింది. తెలుపూ ఎరుపూ కలిసిన వాతావరణపు వెలుగు అంతటా రమణీయంగా వ్యాపించి వుంది. ఆటో దిగక ముందే రాజ్యలక్ష్మి, సంజీవప్ప చేతిలోని సూట్‌కేస్ అందుకుంది. అతడు డ్రైవర్‌కు డబ్బులిచ్చి కిందికి నెమ్మదిగా దిగి, ఆ కొత్త అపార్ట్‌మెంట్‌ను ఎగాదిగా చూసినాడు. ఐదంతస్తుల అపార్ట్‌మెంట్, గంభీరంగా, హుందాగా, నిటారుగా నిల్చున్నట్లు ఉంది. ఆ అపార్ట్‌మెంట్ చుట్టూ పెద్ద కాంపౌండ్. ఒక్కో ఫ్లోర్‌లో ఆరు కుటుంబాల చొప్పున ముప్పయి కుటుంబాలు నివసిస్తున్నాయని వివరించి చెబుతూ వుంది రాజ్యలక్ష్మి.

ఆ ప్రాంగణం అప్పుడే నిద్రమేల్కొని ఆవలిస్తున్నట్టుగా వుంది. దిగువనున్న ఖాళీ స్థలంలో కొందరు వాకింగ్ చేస్తూ కన్పించారు. కొందరు స్కూటర్లతో బయటకు పరుగులు తీస్తున్నారు. ఉదయం పూట విన్పించే చప్పుళ్లేవీ ఆ ప్రశాంత సమయంలో విన్పించలేదు. లిఫ్ట్ ఎక్కి మూడవ అంతస్తుకు చేరుకున్నారు. సంజీవప్ప, రాజ్యలక్ష్మి వెంట కారిడార్‌లో నడుస్తూ, అటూ యిటూ ఉత్కంఠగా చూస్తున్నాడు. ఆ కారిడార్‌కు ఆ పక్క మూడు, ఈ పక్క మూడు కుటుంబాలున్నాయి. తలుపులన్నీ తెరిచే వున్నాయి. సహజంగా, పట్టణాలలో ఇళ్ల తలుపులెపుడూ మూసే వుంటాయి. బెల్ కొడితే తప్ప తలుపులు తెరవరు. పక్క ఇళ్లలో ఎవరుంటున్నారు, ఏం చేస్తున్నారు, వాళ్ల అతీగతీ ఏమిటో పట్టించుకోని రోజులు ఇవి. అలాంటిది తలుపులన్నీ తెరిచి వుండటమే గాకుండా, రాజ్యలక్ష్మిని పల్కరిస్తున్నారు 'ఎవరు? ఏమిటీ? అని. రాజ్యలక్ష్మి వాళ్లతో "మా చిన్నాన్న, హైదరాబాద్‌లో వుంటారు" అని సమాధానాలు చెబుతూ అడుగులు వేస్తుంది. సంజీవప్ప అందరినీ చిరునవ్వుతో పలకరిస్తూ రాజ్యలక్ష్మి వెంట వాళ్ల ఫ్లాట్‌లోకి అడుగుపెట్టాడు. డబుల్ బెడ్ రూమ్ ఫ్లాట్ అది. చాలా పొందికగా శుభ్రంగా వుంది. హాలు ఒక సోఫా, టీపాయ్, నాలుగు కుర్చీలతో ఆహ్వానిస్తున్నట్టుగా వుంది. ఈలోగా రాజ్యలక్ష్మి కూతురు దివ్య లోపల్నుంచి చకచకా హాల్లోకి వచ్చి "బావున్నారా తాతయ్యా" అంటూ పలకరించి హడావుడిగా, బయటకు వెళ్లింది. "మీరు బాత్‌రూమ్‌కు వెళ్లిరండి చిన్నాన్నా" అంటూ రాజ్యలక్ష్మి, సంజీవప్పకు దారి చూపించింది. స్నానం అవి కానించి అరగంటకల్లా హాల్లోకి చేరుకున్నాడు. రాజ్యలక్ష్మి అందించిన కాఫీ తాగుతూ "వచ్చే శుక్రవారమమ్మా గృహప్రవేశం. త్రిబుల్ బెడ్‌రూమ్ అపార్ట్‌మెంట్ అది. మన బంధువులందర్నీ పిలిచే పనిని నా కప్పగించారు. ఈ టౌన్‌లో వున్న మన వాళ్లందర్నీ కలవాలి" అంటూ గృహప్రవేశ ఆహ్వానపత్రికను రాజ్యలక్ష్మికి అందించాడు. "మీరంతా తప్పక రావల్నని.. మరీమరీ చెప్పాడు మీ అన్న" అంటూ ఆ నూతన గృహ విశేషాలను చాలా సంతోషంగా వివరించాడు."మన దివ్య డాక్టరేట్ పూర్తయింది గదా.. ఇప్పుడు ఏం చేస్తుంది?"

"దివ్య ఇప్పుడేం చేస్తుందో చెప్పాలంటే మాటలతో కుదరదు చిన్నాన్నా. రెండు రోజులుంటే మీకే అర్థమవుతుంది. మీరు చొక్కా వేసుకోండి. టిఫిన్ చేద్దురు" అంటూ లేచి నిలబడింది రాజ్యలక్ష్మి. "వంటింట్లో సందడీ లేదు, వాసనా లేదు.. వచ్చినప్పటి నుంచీ చూస్తున్నాను. మొత్తం ఈ అపార్ట్‌మెంటే అదోలా వుంది" అన్నాడు సంజీవప్ప."చెబితే కుదరదు – అపార్ట్ మెంట్ దిగువన డైనింగ్ హాల్ వుంది.

టిఫిన్ చేసి వచ్చిన తర్వాత వివరంగా మాట్లాడుకుందాం" అంటూ బయటకు అడుగులు వేసేసరికి, సంజీవప్ప బుద్ధి మంతుడిలా ఆమెను అనుసరించాడు. కారిడార్‌లోకి, అడుగు పెట్టేసరికి, అపార్ట్ మెంట్లలో వున్న వాళ్లు, చకచకా లిఫ్ట్ ద్వారా మెట్ల మీదుగా, దిగువనున్న ఫ్లోర్‌కు ఉత్సాహంగా వెళ్తున్నారు. రాజ్యలక్ష్మి వెంట సంజీవప్ప లిఫ్ట్ ద్వారా కిందికి చేరుకొని, విశాలమైన డైనింగ్ హాల్లోకి చేరుకున్నారు. కమ్మని వాసనలతో ఆ ప్రాంతమంతా గుబాళిస్తోంది. జరుగుతున్న వ్యవహారమేమిటో ఒక్క ముక్క కూడా అర్థం కాలేదు సంజీవప్పకు. అపార్ట్‌మెంట్లలో కాపురాలుంటే వాళ్లు తమ యిళ్లల్లో టిఫిన్లు చేసుకొని తినకుండా, అంతా యిక్కడకు చేరుకోవడమేమిటి? బహుశా ఏదైనా ఫంక్షన్ ఏర్పాటై వుండవచ్చు. అక్కడ ఇడ్లీ, వడ, దోసె, పూరీ వగైరాలున్నాయి. ఎవరికి నచ్చినవి వారు కమ్మగ ఆరగించేస్తున్నారు. వడ్డించాల్సిన పని కూడా లేదు. అంతా సెల్ఫ్ సర్వీస్. రాజ్యలక్ష్మి ఒక ప్లేట్‌లో రెండు ఇడ్లీలు రెండు వడలు పెట్టుకొని సంజీవప్ప కూర్చున్న బల్ల మీద వుంచి "తినండి చిన్నాన్నా. విషయాలు మీకు మళ్లీ చెబుతాను" అన్నది. కొందరు రాజ్యలక్ష్మి చెంతకు వచ్చి సంజీవప్ప గురించి ఆరాలు తీసి పలకరిస్తున్నారు.

దివ్య అన్నింటినీ, అందరినీ పర్యవేక్షిస్తోంది.

సంజీవప్ప దగ్గరకు వచ్చి "టిఫిన్లు బావున్నాయా తాతా" అని పరామర్శించింది.

"అద్భుతంగా ఉన్నాయి తల్లీ, ఏదైనా ఫంక్షన్ జరుగుతున్నదేమమ్మా" కాస్త ఉత్కంఠతో అడిగినాడు.

"రోజూ ఫంక్షనే తాతా యిక్కడ." ఆ హాల్లో టిఫిన్ తిన్న వారంతా దివ్యతో మాటలు కలుపుతూనే వున్నారు. అంతా సస్పెన్స్‌లా వుంది సంజీవప్పకు. పది నిమిషాల తర్వాత చూస్తే హాల్లో ఎవ్వరూ లేరు. వంటచేసే వాళ్లూ, సర్వర్లూ తప్ప! రాజ్యలక్ష్మి వెంట, లిఫ్ట్‌లో తమ ఫ్లాట్‌కు చేరుకున్నాడు సంజీవప్ప.

"అమ్మా, రాజ్యలక్ష్మీ.. అందరూ ఒక చోట చేరి యిలా ఆహారాన్ని పంచుకోవటం సరదాగా, ముచ్చటగా వుంది. ఏ ఇంట్లో కూడా పొయ్యిలు వెలిగించినట్లు లేదే?!"

"మీరింకా చాలా చూడాలి చిన్నాన్నా. మీరు చూసింది ఒక పూట టిఫిన్ కార్యక్రమం మాత్రమే! ఇది 24 గంటల కార్యక్రమం కాదు. 365 రోజుల



కార్యక్రమం. అందునా కేవలం తిండికి సంబంధించింది మాత్రమే కాదిది!" సంజీవప్పకు ఇదేదో కొత్తగా అనిపించి ఆసక్తిగా వింటున్నాడు.

"ఏదో అద్భుతం చూస్తున్నట్టనిపిస్తోంది" అన్నాడాయన.

"అద్భుతమే చిన్నాన్నా! ఈ అద్భుతాని కంతా కారణం మీ మనవరాలు దివ్య. చాలా చిన్న విముక్తి ఇది! అయితే పెద్ద రిలీఫ్ కూడా. ఇంతకు మునుపు మేము రామ్‌నగర్‌లో ఉంటున్నపుడు మా పక్క ఇంట్లో భారతి అనే టీచర్ వుండేది. ఆమె భర్త కూడా టీచర్. ఇద్దరూ మంచివాళ్లే, వాళ్లకు ఇద్దరు పిల్లలు. భారతి ఎప్పుడూ ఒకే విషయం మాతో మొరపెట్టుకొనేది. తన ఉద్యోగం గురించి చెబుతూ "ఏం ఉద్యోగం చెయ్యటం లేమ్మా! పేరుకే వుద్యోగమూ, జీతమూ.. చేసే చాకిరీ ఎవరికీ కన్పించదు. పొద్దున ఐదుగంటల నుంచీ రాత్రి పడుకొనేదాకా చేసే వంటింటి చాకిరీని, ఎవరూ గుర్తించరు. వంటలు చేయడం, క్యారియర్లు కట్టడం, పిల్లల్ని స్కూల్‌కు రెడీ చేయడం, సాయంత్రం స్కూల్ నుంచీ రాగానే పిల్లలకు స్నాక్స్ చేయడం, మళ్లీ రాత్రికి కూరలో, చపాతీలో చేయడం, చూసే వాళ్లకు ఇదీ ఒక పనేనా అనిపిస్తుంది. ఇంటికొచ్చే మిత్రులకూ, బంధువులకు వండి వార్చడం! చేసేవాళ్లకు మాత్రమే తెలిసే శ్రమయిది. ఈ వంటపని ఒక్కటే లేకుంటే ఎన్నెన్నో గొప్ప పనులు చేసేదాన్నో" అని అంగలార్చేది. మన దివ్య ఆమె మాటల్ని చాలా ఆవేశంగా వినేది. ఎందరో ఆడవాళ్ల ఈ వంటింటి గాథలు వినీ వినీ, చూసీ చూసీ దానికో చిన్న విముక్తి మార్గాన్ని కనిపెట్టింది దివ్య. ఆమెకు ఈ ప్రేరణ యిచ్చినవాడు మహాకవి గురజాడ అప్పారావు అంటే మీరు ఆశ్చర్యపోతారు."

"గురజాడకూ, దివ్య ప్రేరణ పొందటానికీ ఏం సంబంధమమ్మా! చాలా ఆశ్చర్యంగా వుందే" అంటూ విస్తుపోయాడు సంజీవప్ప.

"చెబుతా చిన్నాన్నా.. దివ్య 'గురజాడ సాహిత్యం ఆధునికత' అన్న అంశం మీద పరిశోధనచేసి డాక్టరేట్ పొందిన విషయం మీకు తెలుసు. గురజాడ రాసిన 'సౌదామిని' నవల నోట్స్ చదివినప్పటి నుండి దివ్యకు ఒక కొత్త ఆలోచన వచ్చింది. ఈ నవల 'నోట్స్'లో "స్త్రీలు వంటచేయటాన్ని నిషేధించి పారేయాలి. హోటల్ నుంచి ఆహారం తెచ్చుకోవాలి. ప్రతి వీధికీ ఒక హోటల్ ఉండాలి. ప్రతి కుటుంబం అక్కడికి వెళ్లి భోంచేయాలి. ఇక వంటా వార్పూ చింతే వుండదు. ఇట్లా ఆడవాళ్ల శక్తి ఎంతగా పొదుపు అవుతుందని..." అంటారు గురజాడ! వందేళ్ల క్రితమే గురజాడ, ఆడవాళ్ల గురించి ఎంత

సంస్కారవంతంగా ఆలోచించాడో, ఆ ఆలోచనల రూపమే మన దివ్య ఏర్పాటు చేసిన ఈ సమిష్టి భోజనశాల" అంది రాజ్యలక్ష్మి.

"మరింత వివరంగా చెబుతాను చిన్నాన్నా" అని మళ్లీ కొనసాగించింది రాజ్యలక్ష్మి. "ఐదంతస్తుల ఈ బిల్డింగ్‌లో మొత్తం ముప్పయి కుటుంబాలున్నాయి. మొత్తం నూట ఇరవై ఎనిమిది మంది వున్నాం. వీరందరికి కలిపి నలభై మందికి పైగా ఆడవాళ్లు వండి వార్చాలి. వీరిలో కేవలం గృహిణులే కాకుండా, ఉద్యోగాలు చేసేవాళ్లు, వేర్వేరు పనుల మీద వెళ్లేవారు ఎందరో వున్నారు. ఉదయం నిద్రలేచినప్పటి నుండి ఈ ఆడవాళ్లకెన్నెన్ని పనులు? మొగుళ్ల చాకిరీలూ, పిల్లల చాకిరీలూ ఒకెత్తు అయితే, ఈ వంటచాకిరీ ఒకటే ఒకెత్తు! నిజానికి యింతమందికి వంటచేసి పెట్టడానికి ఏ నలుగురైదుగురో చాలు! ఒక సమిష్టి వంటశాల ఏర్పాటు చేసి, నలుగురు వంటవాళ్లను నియమించు కుంటే, ఈ కుటుంబాలలోని ఆడవాళ్లందరికీ ఎంత శ్రమను తగ్గించవచ్చు అని దివ్య లెక్కలు వేసింది. అంతేగాదు ఖర్చును కూడా కొంత శాతం తగ్గించ వచ్చునని గణాంక వివరాలతో నిరూపించింది."

"మరి దివ్య చేసిన లెక్కల్ని ఒప్పుకున్నారా? అదెలా సాధ్యమయింది?" ఆసక్తికరంగా అడిగాడు సంజీవప్ప.

"అమ్మో! అంత తొందరగా అంగీకరిస్తారా? తిండి దగ్గర నుండీ, ఆహారపు అలవాట్ల వరకూ ఎన్ని అభిప్రాయభేదాలు? తిండి శాతం దగ్గర కూడా ఎన్ని గొడవలు? పెద్ద పెద్ద చర్చలూ, విమర్శలూ, అనుమానాలూ, ఇలాంటి ఎన్నిటినో ఐదారు సమావేశాల తర్వాత ఒక కొలిక్కి తెచ్చింది దివ్య. ముఖ్యంగా ఖర్చులూ, రుచులూ కాదు. ఈ పనివల్ల ఆడవాళ్ల శ్రమ ఎంత తగ్గు తుందో, వాళ్లకు ఎంత తీరిక లభిస్తుందో, వాళ్లు పొదుపు చేసిన శ్రమను ఇతరత్రా ఎలా వుపయోగించుకోవచ్చో కథలు కథలుగా చెప్పి ఒప్పించింది. ఈ పనికంతా ఆరు నెలలు పట్టింది. ఆడవాళ్లయితే చాలామంది వెంటనే ఒప్పేసుకొని మన దివ్యను ఆలింగనం చేసుకున్నారు కూడా! ఎటొచ్చీ ఈ మగవాళ్లతోనే సమస్యలన్నీ, శ్రీశ్రీ ఎప్పుడో అన్నాడు, "ఆలోచించారు కాదు మగజాతి, ఆలోచించనిచ్చారు కాదు ఆడజాతిని" అన్న మాటను నిజం చేశారు వీళ్లు. వీళ్లంతా ఇంటిపనిలో ఆడవాళ్లకు ఏమాత్రమూ సహకరించని బద్ధకస్తులు" అంది రాజ్యలక్ష్మి నిట్టూరుస్తూ.

"చివరకు ఎలా సాధించగలిగినారు?"

"ప్రాక్టికల్‌గా, మొదట ఇష్టపడ్డ 12 కుటుంబాలతో ప్రారంభించాం! దీనికి పూర్తి ఆర్గనైజర్‌గా పని చేసింది దివ్య నాన్నగారు. రెండు నెలలు గడిచేసరికి క్రమక్రమంగా మరో ఆరు కుటుంబాలు కలిశాయి. **అందరూ ఒక టీమ్ వర్క్‌గా పని చేశాం. ఆహార కమిటీ, పారిశుద్ధ్య కమిటీ, న్యూట్రిషన్ కమిటీ, ఆడిటింగ్ కమిటీ.. యిలా ఏర్పడి చిత్తశుద్ధితో** పని **చేసేసరికి, చాలా మందికి విశ్వాసం కలిగింది."**

**"ఇది వ్యాపార లక్షణాలతో** పని **చేస్తున్నది కాదనీ, ఒక ఆశయంతో మహిళలకోసం పనిచేస్తున్న సంస్కార సంస్థ అని అందరికీ అర్థమైంది. నాలుగు నెలలు గడిచేసరికి అపార్ట్‌మెంట్‌లోని ముప్పయి కుటుంబాలూ భాగస్వాము లయ్యారు.** విజయనగర్ కాలనీలో వున్న ఇతర అపార్ట్‌మెంట్స్ వారు కూడా ఈ ప్రణాళికను అమలు పరచే పనిలో వున్నారిప్పుడు. ఈ పనిని ఒక జీవితాశయంగా భావించిన దివ్య కృషీ, వాళ్ల నాన్న అండదండలూ, మాటలతో చెప్పటానికి వీలు లేనిది. ఈ ఆరేడు నెలలు కష్టాన్నంతా, రెండు రోజులు చెబితే గాని తెల్లారదు. మీరు మీ గృహప్రవేశ శుభలేఖలు పంచుతూ రెండు మూడు రోజులిక్కడ వుండండి. ఈ కుటుంబాలన్నిటినీ పరామర్శ చేయండి. ప్రతి ఇంటిలో అడుగు పెట్టగానే గురజాడ ఫోటో, వచ్చిన వాళ్లను పలకరించేలా ఏర్పాటు చేసింది దివ్య" అంటూ చెబుతూనే వుంది రాజ్యలక్ష్మి.

ఆ రోజు సాయంత్రం వరకూ, తెలిసిన వాళ్ల యిళ్లకు రాజ్యలక్ష్మిని కూడా వెంటబెట్టుకొని వెళ్లి, గృహప్రవేశ ఆహ్వాన పత్రికలు పంచి వచ్చాడు సంజీవప్ప. రాత్రి ఎనిమిదిగంటలప్పుడు అపార్ట్‌మెంట్ దిగువన వున్న డైనింగ్ హాల్లో భోంచేసి వస్తూ, రాజ్యలక్ష్మి సంజీవప్పను ఒక యింట్లోకి తీసుకెళ్లింది. ఆ ఇంటి ఇల్లాలు రాజ్యలక్ష్మి కాలేజీలో క్లాస్‌మేట్ కూడా! ఆమెను కదిలిస్తే తన ఉద్యోగ కాలపు కష్టాలన్నీ తవ్వి పోసింది.

"నిజం చెప్పాలంటే నా జీవితంలో సగభాగం వంటింట్లోనే గడిచిపోయిన విషయం ఇప్పుడంతా గుర్తుకు వస్తోంది. ఇప్పుడంటే గ్యాస్ స్టవ్‌లూ, కుక్కర్లూ వచ్చినాయి గాని, అప్పుడంతా కట్టెల పొయ్యిలేగదా! ఇప్పుడు తలచుకుంటే ఒళ్లంతా జలదరిస్తుంది. ఇప్పుడెంత హాయిగా వుందో, రోజుకు ఒక నవల చదివేస్తున్నానంటే నమ్మండి. నిజం చెబుతున్నాను, ఈ నాలుగు నెలల కాలంలోనే నావి మూడు కథలు అచ్చయ్యాయి. ఇదంతా మన దివ్య చలవే" అంటూ చాలా విషయాలు చెప్పుకొచ్చిందామె. సంజీవప్పకు ఒక అద్భుత ప్రపంచంలోకి అడుగు పెట్టినట్టయింది. మరుసటి రోజంతా యిదే పని సంజీవప్పకు. చాలా ఇళ్లలోకి వెళ్లటం, ఆ ఇంటి ఇల్లాళ్ల అనుభవాలను వినటం!

ఒక ఫ్లాట్‌లో సంగీత అనే ఆవిడ "నాకు బాల్యం నుండీ సంగీతమంటే ప్రాణం! మా నాన్న నాకు పెట్టిన పేరే సంగీత! దురదృష్టవశాత్తూ నాకు పెళ్లయిన నాల్గురోజులకే నా సంగీతం అటకెక్కింది. కారణాలు చాలా వున్నాయి. నేనెప్పుడూ మరచిపోలేని కారణం మాత్రం వంటపనే!

ఇదిగో, ఇప్పుడు ఎవరినీ లెక్కబెట్టకుండా అటక మీదున్న వయెలిన్ దించాను. సాధన చేస్తూ, నలుగురు పిల్లలకు నేర్పిస్తున్నాను కూడా" అన్నది.

"ఇలాంటి పని ఇరవై ఏళ్ల క్రితమే మొదలై వుంటే, నాకు మోకాళ్ల ఆపరేషన్ జరిగి వుండేది కాదు" అంటూ విచారం వ్యక్తంచేసింది కామేశ్వరి అనే అరవై ఏళ్ల మహిళ.

"ఆఫీస్ పంక్చువాలిటీ పాటించలేకపోతున్న నాకు మా ఆఫీసర్‌తో రోజూ చీవాట్లే! ఇప్పుడా గొడవేలేదు" అంది సౌభాగ్య అనే ముప్పయి ఏళ్ల ఆవిడ!

ఇలా ఒకరా? ఇద్దరా? కదిలిస్తే చాలు, ఎన్ని సంగతులు చెబుతున్నారో, ఇవన్నీ తనకు తెలిసిన విషయాలే అయినప్పటికీ, కొత్తగా వింటూ విస్తుపోతున్నాడు సంజీవప్ప. ప్రతి ఒక్కరూ అంతిమంగా దివ్యను గురించి కీర్తిగానం చేయటమే! సంజీవప్ప ఆలోచనలు క్రమంగా కొత్త దారి పడుతున్నాయి. రేపు తాము చేరబోయే అపార్ట్‌మెంట్‌లో ఈ విధానం ప్రవేశపెడితే ఎలా వుంటుందో ఆలోచిస్తున్నాడు. ఈ అపార్ట్‌మెంట్‌ను ఆదర్శంగా తీసుకొని నడిపితే, లక్షలాది ఆడవాళ్ల శ్రమ ఎంత పొదుపవుతుందో? ఈ ఆలోచనే సంజీవప్పకు నవ్యాతినవ్యంగా అనిపించింది.

మరుసటి రోజు సంజీవప్ప తను సొంత వూరికి గృహప్రవేశ ఆహ్వాన పత్రికలు అందించటానికి బయలు దేరాడు. ఆ అపార్ట్‌మెంట్‌లోని చాలామంది ఆయనకు ప్రీతిపూర్వకంగా వీడ్కోలు పలికినారు. ఆ అపార్ట్‌మెంట్ కథాకమామిషు గురించి, దివ్య తాను రాసి ప్రచురించిన చిన్న 'బుక్‌లెట్' ప్రతులను ఆయనకు అందిస్తూ "మీ లాంటి పెద్దలు, ఇలాంటి పనిని ఒక ఉద్యమంలా నడిపించటానికి సహకరించాలి" అని అభ్యర్థించింది. సంజీవప్ప, దివ్య తలను ఆప్యాయంగా నిమురుతూ "అవునమ్మా, నిజంగా ఇది ఇక ఉద్యమ రూపం దాలిస్తే, ఎందరో మహిళలకు స్ఫూర్తిదాయకమౌతుంది. గురజాడ ఆలోచనలకు ప్రతిబింబమైన ఈ అపార్ట్ మెంట్స్‌కు 'గురజాడ అపార్ట్‌మెంట్స్' అని కొత్త పేరు పెట్టండి. ఆ పేరే ఒక కర్తవ్యాన్ని సూచిస్తుంది కూడా" అంటూ పిడికిలి బిగించాడు సంజీవప్ప. ❖

# ఆదర్శ మాతృమూర్తి కుంచం రమణమ్మ



కుంచం రమణమ్మ ఆగస్టు 17న కరోనాతో చనిపోయారు. ఆమె కార్యకర్తలను తన సొంత బిడ్డలుగా ఆదరించేవారు. ఏదైనా కార్యక్రమము వుంటే మొదటిగా వచ్చే వ్యక్తి ఆమె

రమణమ్మ విశాఖనగరంలో ఐద్వా కార్యకర్తగా, నాయకురాలిగా పనిచేశారు. ఆమె విశాఖపట్నం జిల్లాలో సబ్బవరం మండలం ఆరిపాక గ్రామంలో అక్టోబర్ 1962న జన్మించారు. తల్లి అందుకూరి సత్యవతి, తండ్రి వెంకట రావు, చిన్న వయస్సుల్లోనే తండ్రి చనిపోయారు. 14 సంవత్సరముల వయసులో కుంచం సుబ్బారావుతో ఆమె వివాహం జరిగింది. . ముగ్గురు పిల్లలు పెద్ద కుమార్తె సుజాత, టీచరుగా పనిచేస్తూ సోషల్ మీడియా బాధ్యత చూస్తున్నారు. చిన్న కుమార్తె సుభాషిణి అనకాపల్లి ఐద్వాలో పని చేస్తున్నారు. కుమారుడు రాజేష్ ప్రజాశక్తి ఫోటోగ్రాఫర్‌గా పని చేస్తున్నారు. పిల్లలు అందరికీ కులాంతర వివాహాలు చేశారు. అల్లుళ్ళు పూర్తి కాలం కార్యకర్తలుగా ప్రజా ఉద్యమాలలో పని చేస్తున్నారు. కోడలు స్వచ్ఛంద సంస్థలో పని చేస్తున్నారు. ఆదర్శ కుటుంబం వారిది.

1985లో అనకాపల్లిలో జరిగిన పార్టీ క్లాసులకు భర్తతో పాటు హాజరయ్యి అప్పటి నుండి మహిళా సంఘం, పార్టీ కోసం పని చేశారు. పుణ్యవతి, హైమావతి, విజయ, ఉమ, బేగం, లక్ష్మీతో కలిసి మహిళా సంఘంలో పనిచేశారు. సనాతన కుటుంబం వలన బయటికి వెళితే అత్త, కుటుంబ సభ్యులు ఒత్తిడి, హేళన చేసినా భర్త ప్రోత్సాహంతో కార్యక్రమాలకు వెళ్లేవారు. సారా ఉద్యమం జరిగినప్పుడు శివాజీ పాలెం సారా కొట్టు మూసేందుకు మహిళలను కూడ గట్టుకొని వెళ్లారు.

భర్త క్యాజువల్ వర్కర్‌గా ఆంధ్రా యూనివర్సిటీలో పనిచేసే వారు. జీతం చాలా తక్కువ, ముగ్గురు పిల్లలు. పేదరికంలో ఆ కుటుంబం బ్రతికింది. అయినా ఆమె ఎప్పుడూ భయపడలేదు. భర్త యూనివర్సిటీ యూనియన్ లో చురుకైన కార్యకర్తగా పనిచేయడానికి ఆమె ప్రోత్సహించారు తప్ప, కుటుంబ సమస్యలతో నిరాశ చెందలేదు. పిల్లలందరికీ పూర్తి స్వేచ్ఛ నిచ్చారు. మంచి పని, సమాజహితం కోసం కృషి చేసే వారుగా పిల్లలు తయారయ్యారు.

సుబ్బారావు గారు యూనివర్సిటీలో వీరి తిండి బాగోగులు చూస్తే రమణమ్మ గారు వాళ్ళ ఇంటికి వెళ్తే తిండి పెట్టకుండా వదిలేవారు కాదు. ఆమె కలిసిన వారిని కుటుంబ సభ్యులందరి గురించి పేరుపేరునా అడిగి తెలుసుకునేవారు. ఆప్యాయత అనురాగంకి ఐకాన్ రమణమ్మ. చాలామంది కార్యకర్తలు నాయకులు ఆమెని అమ్మ అనే పిలిచేవారు. ఎందరో కార్యకర్తలు అమ్మగా భావించే రమణమ్మకి శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.



ఆశయం గట్టిదయితే లక్ష్యం కాళ్ల చెంతన వాలుతుంది!

# ఆన్‌లైన్లో 40 లక్షల మందికి పాఠాలు!

కేరళలోని మల్కాపురం జిల్లా మూర్కనాడ ప్రాంతంలో ఏఈఎమ్‌ఏయూపీ పాఠశాలలో ఆన్‌లైన్ క్లాస్ జరుగుతోంది. ఎల్‌కేజీ పిల్లలు ఎవరిళ్లల్లో వాళ్లు సీరియస్‌గా పాఠం వింటున్నారు. జంతువుల గురించి ఉపాధ్యాయిని వివరంగా చెబుతున్నారు. ఆ జంతువుల్లో ఏనుగు కూడా ఉంది. హఠాత్తుగా తరగతి గదిలోకి ఓ ఏనుగు వచ్చి నాట్యం చేసింది. అలాగే ఆవు వచ్చింది. సాంఘిక శాస్త్ర ఉపాధ్యాయురాలు విశ్వం గురించి బోర్డు మీద బొమ్మలు వేసి వివరించింది. సంబంధిత వీడియోనూ ప్రదర్శించారు. సౌర కుటుంబం పాఠాన్ని ఆన్‌లైన్‌లో ఎలా చెబుతారో తెలుసుకుందామని ఆ రోజు తలిదండ్రులు కూడా వచ్చి కూర్చున్నారు. ఆ తరగతిలో విశ్వం ప్రత్యక్షమయింది. గ్రహాలు, సూర్యుడు, భూమి, చంద్రుడు వాటి పరిభ్రమణాలను ఉపాధ్యాయిని వివరించారు. అలాగే రోబోలను గురించి చెప్పినా, వర్షాన్ని గురించి చెప్పినా వీడియోల ద్వారా ఆ అనుభూతిని కళ్లకు కట్టిస్తున్నారు. ఇదంతా కరోనా నేపథ్యంలో పాఠశాలలు మూతబడిన ఆన్‌లైన్ విద్యా బోధనలో కేరళ సృష్టించిన కొత్త వరవడి. బుడి బుడి నడకల బుడ్డోళ్లు మొదలు 12వ తరగతి నూనూగు మీసాల నూతన యువత వరకూ 40 లక్షల మంది విద్యార్థులు ఆన్‌లైన్ పాఠాలను కంటూ, వింటున్నారు. ఈ కరోనా కష్టంలో విద్యార్థులకు కంప్యూటర్లనూ, ఉపాధ్యాయులకు డిజిటల్ క్లాసు రూముల్నీ సమకూర్చి కేరళ వామపక్ష ప్రభుత్వం సృజనాత్మక విద్యా బోధన అవకాశాలను కల్పించడం అభినందనీయం. మన రాష్ట్రంలో కూడా ఈ పరిస్థితి ఎప్పుడు వస్తుందో..!

# అమ్మాయి పుడితే సంబరాలే..

## అన్నలకే కాదు చెట్లకూ రాఖీలు



సాధారణంగా ఇళ్లల్లో పిల్లలు పుడితే వేడుకలు చేసుకుంటాం. మిఠాయి పంచడం, పిల్లలకు పేరు పెట్టి భోజనాలు పెట్టడం లాంటివి. కానీ రాజస్థాన్‌లోని 'పిప్లాంత్రి' గ్రామస్తులు ముఖ్యంగా ఆడపిల్ల పుట్టుకను అత్యంత వైభవంగా సంబరాలు చేస్తారు. అవి ఎలాగంటే వారి ఇంట్లోనే కాక ఆ గ్రామం మొత్తం సంబరాలు చేసుకుంటారు. ఆ సంబరాలు ఇలా ఉంటాయి. పాప పుడితే తల్లిదండ్రులు 111 మొక్కలు నాటి వాటిని జాగ్రత్తగా కాపాడి ప్రత్యేక సందర్భాల్లో పూజిస్తూ ఉంటారు. ఆ మొక్కలకు ఆడపిల్లలు రాఖీలు కట్టి తమ సోదరులుగా ఆహ్వానం పలుకుతారు. ఆ మొక్కలను వారి ఇంట్లోనే నాటాలని ఏం లేదు ఊర్లో ఎక్కడైనా నాటుతారు. అలా ఇప్పటివరకు మూడు లక్షల చెట్లను నాటి వాటికి చీడ పీడలు శోకకుండా చుట్టూ కలబంద మొక్కలతో కంచె వేస్తారు. అంతే కాదు పాప పుట్టగానే ఆ పాప పేరుమీద ఆ గ్రామస్తులంతా కలిసి ఒక ఫండ్ ఏర్పాటు చేస్తారు. అందులో మూడోవంతు తల్లిదండ్రులిస్తారు. మిగతాది గ్రామస్తులు వేసుకుంటారు. భవిష్యత్తులో అమ్మాయి ఏ ఇంటికి భారం కాకూడదనేది వారి ఆలోచన. ఆ డబ్బు శాశ్వత ఖాతాల్లో జమ చేస్తారు. 20 సంవత్సరాలు వచ్చే వరకు ఆ డబ్బు తీయకూడదు. అమ్మాయిని బాగా చదివించి 18 ఏళ్లు నిండాక పెళ్లి చేస్తామని ప్రకటన చేసి చట్టపరంగా ఒప్పంద పత్రం పైన సంతకం చేస్తారు. ఆ చెట్లకి, అమ్మాయికి కూడా వారిచ్చే గౌరవం ఇది. పర్యావరణ పరంగా అమ్మాయి బాధ్యత పరంగా ఈ గ్రామం చుట్టపక్కల గ్రామాల ప్రశంసలను అందుకుంటుంది. ఈ సాంప్రదాయం వల్ల ఊరందరికి మేలు జరుగుతోంది. అందుకే అది ఆదర్శ గ్రామం అయ్యింది.




# కోవిడ్ - 19 నియంత్రణ - మూఢనమ్మకాలపై తిరుగుబాటు

**స్వ**తంత్ర పోరాటంలో విప్లవాత్మకంగా పాల్గొని, పురోగామి ఆదర్శాలు, ప్రజాతంత్ర హక్కులు, లింగ సమానత్వం గురించి ప్రచారం చేసిన లక్ష్మి సెహగల్ గారి 8వ వర్ధంతిని 23 జూలై 2020న ఐద్వా ఘనంగా జరుపుకుంది.

ఈ కాలంలో ప్రజల భయాలను, ముఖ్యంగా మహిళల భయాలను ఆధారం చేసుకుని, అశాస్త్రీయ నమ్మకాలను వ్యాప్తి చేయడానికి అంధవిశ్వాస శక్తులు ప్రయత్నం చేస్తున్నాయి. అనేక సాంప్రదాయ పద్ధతులు, రుజువు కాని చిట్కాలను సూచిస్తున్నారు. మహమ్మారి ముసుగులో, సంఘ పరివార్ శక్తులు సాంప్రదాయ విలువలను, మత విద్వేషాన్ని, పితృస్వామ్య భావాలను సమాజంలో బలోపేతం చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. పురోగామి, ప్రజాస్వామ్య శక్తులు దీనిని ఐక్యంగా ప్రతిఘటించాలి.

నిర్దిష్టమైన, హేతుబద్ధమైన అవగాహనను ప్రజలముందు వుంచడంలో కేరళ మినహా ఇతర రాష్ట్ర, కేంద్ర, ప్రభుత్వాలు విఫలమైనాయి. మోడీ ప్రారంభించిన లాక్ డౌన్, చప్పట్లు కొట్టడం, దీపాలు వెలిగించడం, లాంటి చర్యలు ఏ విధంగానూ సహాయపడలేదు.

ప్రజలు కోవిడ్ 19 నుంచి ఉపశమనం, రక్షణ కోరుకున్నప్పుడు, అశాస్త్రీయ నమ్మకాలు ప్రజలలో ఆదరణను పొందాయి. ఎ ఐ పి ఎస్ ఎన్ (శాస్త్రీయ ఆలోచనలు గలిగిన వివిధ సంస్థల వేదిక), శాస్త్రవేత్తలకు చెందిన పలు సంఘాలు, డాక్టర్లు, ప్రజా ఆరోగ్య నిపుణులు ముందంజలో వుండి ప్రపంచ ఆరోగ్య సంస్థ, ఐ సి ఎం ఆర్ సూచనల మేరకు కోవిడ్19కి సంబంధించి ఏమిటి పాటించాలి? ఏమిటి పాటించకూడదు అనే సమాచారాన్ని ప్రజలకు అంద జేస్తున్నారు. అనేక ప్రజా సమ్మతమైన అలవాట్లు చికిత్సగా ఆమోదంపొందాయి. ఎందుకంటే 80% కేసులలో రోగం స్వీయ నియంత్రణ కలిగింది. కనుక రోగి ఎక్కువ జోక్యం అవసరం లేకుండానే కోలుకుంటాడు.

ప్రస్తుతానికి అలోపతిలో నివారణకు మందు లేనప్పటికి, శాస్త్రవేత్తలు, ఆరోగ్య సిబ్బంది ఈ వైరస్ గురించి, దాని ప్రభావం గురించి చాలా తెలుసుకున్నారు, ఆ విజ్ఞానాన్ని కోవిడ్ 19 పరీక్షలకు, చికిత్సకు ఉపయోగిస్తున్నారు. ప్రస్తుత పరిస్థితుల్లో ఆక్సిజన్ సహాయంతో లేదా ఆక్సిజన్ సహాయం లేకుండా లేదా వెంటిలేటర్ సహాయంతో వైద్యం అందిస్తున్నారు. ఇంకా, సమర్థతను, సురక్షితను నిర్ధారించుకోవడానికి క్లినికల్ ట్రయల్స్ కు ప్రాధాన్యతను ఇస్తూ రోగ నివారణకు టీకాల కోసం అన్వేషణ జరుగుతున్నది. ఇది శాస్త్రీయమైన విధానం. తమ విజయాన్ని ఎర్రకోట నుంచి స్వతంత్ర దినోత్సవం నాడు ప్రకటించడానికి అత్యంత తొందరగా వేక్సిన్ క్లినికల్ ట్రైల్స్ నిర్వహించమని హాస్పిటల్స్ పైన ఒత్తిడి

తీసుకురావడం జరిగింది. శాస్త్రవేత్తలు, ఆరోగ్య నిపుణుల సముదాయం, చైతన్య వంతమైన ప్రజలు కలసికట్టు చర్యల ద్వారా దీనిని నిలువరించారు.

శాస్త్రీయ పరిక్షకు నిలబడని కొన్ని చికిత్సలను ప్రజల ముందుకు తెస్తున్నారు. అటువంటి ఏ ప్రచారం చేసుకోవడానికైనా కేంద్రం అనుమతిస్తోంది. కేంద్ర ఆరోగ్యమంత్రిని ఈ విషయంపై అడిగితే వాటిని ఖండించలేదు.

ఆయుర్వేద "నివారణ" అని బాబా రామదేవ్ పతంజలి ప్రచారం చేశారు. సంఘ్ - పరివార్‌తో రాజకీయంగా మంచి సంబంధాలున్న బాబా నకిలీ "క్లినికల్ ట్రైల్స్" ఆధారంగా తన మందును వాణిజ్య స్థాయిలో ఉత్పత్తి చేయడానికి అన్ని ఏర్పాట్లు చేసుకున్నాడు. శాస్త్రవేత్తలు, డాక్టర్లు చైతన్యవంతమైన ప్రజలు ఈ విషయమై గగ్గోలు పెట్టారు. అయినప్పటికి, తెలివిగా 'నివారణ' అనే పదాన్ని వాడకుండా కోవిడ్ 19 పై యుద్ధములో ప్రజలకు సహాయపడతాయని అనేక రకాల రోగనిరోధకశక్తిని పెంచుతాయనే పేరుతో కషాయాల ప్రచారం కొనసాగుతుంది.

సంఘ్ -పరివార్ దానికి సంబంధించిన శక్తులు కోవిడ్ -19ని మత విద్వేషాన్ని వ్యాప్తి చెయడానికి ఉపయోగించారు. అశాస్త్రీయ వాదనలు అధికారంలో ఉన్న పార్టీ దానికి సహకరించింది.

నిజాముద్దీన్‌లో అత్యధిక సంఖ్యలో ఒక మతము వారు గుమిగూడటం కరోనా వ్యాప్తి కావడానికి కారణమయింది. దానిని ఒక క్రమపద్ధతిలో అనేక నెలలపాటు ఉపయోగించుకొని ఒక మతానికి చెందిన మైనారిటీలను రాక్షసులుగా ఈ మహమ్మారి వ్యాప్తికి ప్రధానకారకులన్నారు. సైన్స్ ప్రకారము అక్కడ మతము కాదు పెద్ద గుంపు, భౌతిక దూరం లేకపోవడం లేదా ఇతర జాగ్రత్తలు తీసుకోకపోవడం అన్నవి ముఖ్యమైన అంశాలు. వాస్తవంగా

> **ప్రజలు కోవిడ్ 19 నుంచి ఉపశమనం, రక్షణ కోరుకున్నప్పుడు, అశాస్త్రీయ నమ్మకాలు ప్రజలలో ఆదరణను పొందాయి. ఎ ఐ పి ఎస్ ఎన్ శాస్త్రవేత్తలకు చెందిన పలు సంఘాలు, డాక్టర్లు, ప్రజా ఆరోగ్య నిపుణులు ముందంజలో వుండి ప్రపంచ ఆరోగ్య సంస్థ, ఐ సి ఎం ఆర్ సూచనల మేరకు కోవిడ్19 కి సంబంధించి ఏమిటి పాటించాలి. ఏమిటి పాటించకూడదు అనే సమాచారాన్ని ప్రజలకు అందజేస్తున్నారు.**

దేశవ్యాప్తంగా ప్రజాదరణ కలిగిన గుడిలో అనేకమంది పూజారులకు, భక్తులకు వైరస్ సోకడం కూడా ఈ కారణం వలనే. దీనిని మనం ప్రతిఘటించాలి.

పితృ స్వామ్యాన్ని బలపరచడానికీ మతాన్ని ఉపయోగించుకుంటున్నారు. వైరస్‌ను కోపగించుకున్న దేవతగా వ్యక్తీకరించి, మతం పేరుతో ఆచారాలకు, ముఖ్యంగా లింగపరమైన మెలిక పెట్టారు. వివిధ రాష్ట్రాలనుంచి ఐద్వా కార్యకర్తలు ఇటువంటి ధోరణులను గమనించి ఆందోళనలు చేస్తున్నారు.

**దేవాలయాలు తెరవడానికి ప్రభుత్వ నిషేధం ఉన్నప్పటికీ, రాజస్తాన్‌లో కొన్ని ప్రసిద్ధ దేవాలయాలను మోసపూరితంగా తెరచి, దేవాలయాల తలుపులు "వాటంతటవే" తెరచుకున్నాయని పుకారులను వ్యాప్తి చేశారు. ప్రజలు, ముఖ్యంగా మహిళలు అక్కడ "కరోనా వైరస్"ను సంతృప్తి పరచడానికి పూజలు చేయాలని చెప్పారు.**

**దురదృష్టవశాత్తు దళిత వెనుకబడిన వర్గాల కుటుంబాలలోని మహిళలు ఈ విధంగా చెయ్యమని ఒత్తిడి చేయబడ్డారు.** ఉత్తరాఖండ్, పశ్చిమ బెంగాల్‌లో కూడా కోపగించుకున్న "కరోనా దేవత" ఆలోచన ప్రచారం చేయబడింది. తెలంగాణలో సంఘ్ పరివార్ అనుకూల శక్తులు, తరచూ మహిళల నాయకత్వంలో, "ప్రభాత్ భేరీలు" లేదా "ప్రాతఃకాల మార్చ్" లకు నాయకత్వం వహిస్తూ, మహిళలు పూజలు ఇతర సంస్కారాలు లేదా సంప్రదాయాలు పాటించడం మానివేసినందునే కోవిడ్ మహమ్మారి వచ్చిందని ప్రచారం చేస్తున్నారు. కోవిడ్‌ని, తరిమివేయడానికి తిరిగి వాటిని పాటించాలని పిలుపునిస్తున్నారు.

ఒడిషాలో సంఘ్ పరివార్ అనుకూల శక్తులు గుళ్లను మూసివుండకూడదని ప్రచారం చేస్తున్నాయి. సుప్రీం కోర్ట్ రథ యాత్రకు అనుమతి ఇవ్వకపోవడానికి కారణం అది ముస్లిం, క్రిస్టియన్లకు అనుకూలంగా వుండటమేనట! నిజానికి, భౌతిక దూరం, చేతులు పరిశుభ్రత పాటించకపోవడంతో ఇటువంటి సమూహాల నుండి కోవిడ్ పాజిటివ్ కేసులు వ్యాప్తి చెందాయి.

ఈ సందర్భంగా ఐద్వా ఎ ఐ పి ఎస్ ఎన్ (శాస్త్రీయ ఆలోచనలు గలిగిన వివిధ సంస్థల వేదిక) మతఛాందస శక్తులచే ప్రచారం కాబడుతున్న అశాస్త్రీయ మూఢ నమ్మకాలపై పోరాటానికి ఉమ్మడి ప్రచారాన్ని జూలై 23 నుంచి ప్రారంభించింది. లక్ష్మి సెహగల్ ముఖ్యంగా ఆమె అంధ విశ్వాసాలకు వ్యతిరేకంగా పోరాడడంలోను, శాస్త్రీయ ధృక్పదాన్ని ప్రోత్సహించడంలోనూ ప్రముఖ పాత్ర వహించారు. ప్రజలకు మూఢ నమ్మకాలకు బదులుగా సైన్స్, రాజ్యాంగంలో పొందుపరచినట్టుగా శాస్త్రీయ ధృక్పదాన్ని విస్తారంగా అభివృద్ధిపరచమని డిమాండ్ చేస్తున్నాయి. ఐద్వా- ఎ ఐ పి ఎస్ ఎన్ (శాస్త్రీయ ఆలోచనలు గలిగిన వివిధ సంస్థల వేదిక) సంయుక్త ప్రచారం దేశవ్యాపితంగా జులై 23 నుండి జాతీయ సైన్స్ దినం ఆగస్టు 20 వరకు, మత ఛాందసవాదానికి వ్యతిరేకంగా ఉద్యమించిన డాక్టర్. నరేంద్ర దొభోల్కర్‌ను అభివృద్ధి నిరోధక శక్తులు హత్యచేసిన



### కులదురహంకార హత్యా కేసులో

# నేరస్తులను వదిలేసిన కోర్టు

**ఇ**టీవల మద్రాసు హైకోర్టు తమిళనాడుకు చెందిన 'ఉడమరై శంకర్' కులదురహంకార హత్య కేసులో నిందితులను నిర్దోషులుగా తీర్పు ఇచ్చింది. తమిళనాడులోని తిరువూర్ జిల్లాలో 'ఉడమల్' పేటకు చెందిన ఉడమలై శంకర్ అనే దళిత యువకుడు అదే ప్రాంతానికి బిసి ఉన్నత కులానికి చెందిన 'కౌసల్య' అనే యువతిని 2015లో పెళ్లి చేసుకున్నాడు. 2016 మార్చి 13న యువతి తరపు బంధువులు పట్టపగలు ఉడమల్ పేట బస్‌స్టాండ్ వద్ద ఈ జంటపై దాడులు జరిపారు. ఈ దాడుల్లో శంకర్ తీవ్రంగా గాయపడి మరణించగా కౌశల్య తీవ్ర గాయాలపాలైంది. ఈ దాడిని దేశం యావత్తు ఖండించింది.

ఈ ఘటనలో నిందితులైన 11 మందిలో ఆరుగురికి తిరుపూర్ జిల్లా కోర్టు 2017 డిసెంబర్ 12న ఉరిశిక్ష విధించింది. ఇందులో కౌశల్య తండ్రి చిన్నస్వామి కూడా వున్నాడు. ముగ్గురిని నిర్దోషులుగా విడిచిపెట్టింది. నిర్దోషులలో కౌశల్య తల్లి అనంత లక్ష్మి ఉంది. అయితే నిందితులు మద్రాసు హైకోర్టును ఆశ్రయించారు.

ఉరిశిక్ష పడిన ఆరుగురిలో చిన్న స్వామి నేరానికి ఎటువంటి సాక్ష్యాధారాలు లేవని అతనిని కూడా నిర్దోషిగా హైకోర్టు తీర్పునిచ్చింది. మిగిలిన ఐదుగురిలో ఇద్దరి హంతకులకు ఐదు సం॥ల జైలు శిక్షగా, మరో ముగ్గురికి 25 సం॥ల జైలు శిక్షగా ఉరిశిక్షను మార్చి అందరినీ షాక్‌కు గురి చేసింది.

ఈ కేసులో హైకోర్టు ఇచ్చిన తీర్పును పరిశీలిస్తే కోర్టు దీనిని కులదురహంకార హత్య నేరంగా పరిగణించలేదని అర్థమవుతుంది. కౌశల్య తల్లిదండ్రులను నిర్దోషులుగా ప్రకటించి ఇద్దరు కాంట్రాక్ట్ హంతకులకు శిక్షను తగ్గించడం బట్టి హైకోర్టు దీనిని ఒక సమిష్టి నేరంగా కాకుండా (ఆధారాలున్నా) కౌశల్య తల్లిదండ్రులకు, హంతకులకు సంబంధాలు లేనట్లుగానే భావించింది. ఇదే నిజమైతే హంతకులు



ఆ జంటను హత్య చేయాలని ఎందుకు ప్రయత్నించారు అనే ప్రశ్న వెంటనే ఉత్పన్నమౌతుంది.

అయితే ఇదే హైకోర్టు **2014లో ఐద్వా, టిఎన్‌యుఇఎఫ్ చేపట్టిన "దిలీప్ కుమార్ వెర్సస్ తమిళనాడు" కేసులో రాష్ట్రంలో కులదురహంకార హత్యలు దానికి సంబంధించిన నేరాలెక్కువగా ఉన్నాయని** అవి అరికట్టడానికి కావలసిన మార్గదర్శకాలను కూడా విడుదల చేసింది. **2018లో** మరోక కేసులో తాము సూచించిన మార్గదర్శకాలను తప్పనిసరిగా పాటించాలని వత్తిడి చేసిన హైకోర్టు ఈ ఉడుమలై శంకర్ కేసును మాత్రం అసలు కులదురహంకార **హత్యగానే గుర్తించ లేదు. తాము ఇచ్చిన మార్గదర్శకాలనే తుంగలో తొక్కింది.**

ఈ రకమైన **తీర్పు సమాజంపై దుష్ప్రభావం చూపుతుంది. కులాంతర వివాహాలను చేసుకున్న యువతకు భయాందోళలను కలిగించేదిగా వుందీ తీర్పు.** ఈ కులదురహంకార హంతకులు కులపిచ్చి, వెర్రి వున్న పితృస్వామ్య విలువల నుండి పుట్టుకొస్తున్నారు. ప్రజా స్వామ్యానికిది మాయని మచ్చలాంటింది.

హైకోర్టు ఇచ్చిన ఈ తీర్పును ఐద్వా పూర్తిగా వ్యతిరేకిస్తున్నది. దీనిపై సుప్రీం కోర్టులో అప్పీలు చెయ్యాలని తమిళనాడు ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తుంది. ఇటువంటి కులదురహంకార హత్యలు, సంభంధిత నేరాలను అరికట్టడానికి ప్రత్యేక చట్టం తేవాలని ఐద్వా డిమాండ్ చేసింది. ఈ విషయమై ఐద్వా ప్రభుత్వానికి డ్రాఫ్ట్ బిల్లును సమర్పించింది.




దామోదర్ సావర్కర్, శ్యాంప్రసాద్ ముఖర్జీ

తెలంగాణ సాయుధ పోరాటం

వర్లీ ఆదివాసీ పోరాటం మహారాష్ట్ర




జాతీయోద్యమ కాలంలో మతోన్మాదుల దుర్మార్గం

# ఆర్‌ఎస్‌ఎస్ - విదేశీ భజన

**రా**మకృష్ణ పరమహంస 1897లో పురుష సన్యాసులు కోసం కలకత్తాలో ఒక ఆశ్రమాన్ని స్థాపించాడు. ఆ మఠంలో ఒక సన్యాసిగా చేరిన కేశవ్‌బలరాం హెగ్డేవార్, మతం బోధించే సర్వమత సామరస్యాన్ని జీర్ణించుకోలేక మఠం నుండి బయటకు వచ్చి మహారాష్ట్రలోని నాగపూర్‌లో మరికొంత మందిని కలుపుకొని 1925లో విజయదశమి రోజు ఆర్‌ఎస్‌ఎస్ అనే సంస్థను స్థాపించాడు.

భారతదేశంలో హిందూమత సాంప్రదాయాలను కాపాడి, చాతుర్వర్ణ వ్యవస్థని పున:ప్రతిష్ఠించాలని, దేశంలో ప్రతి మనిషి హిందూ మత ధర్మానికి దాసుడిగా ఉండాలని సంస్థ యొక్క లక్ష్యమని ప్రకటించాడు.

దేశంలో ఉన్న అన్య మత ప్రజలు హిందూ ధర్మానికి బద్ధులై ఉండాలనీ, లేకపోతే దేశం విడిచి వెళ్లిపోవాలని హెచ్చరించాడు. అంతటితో ఆగకుండా ముస్లిములు, కమ్యూనిస్టులు, క్రైస్తవులను శత్రువులుగా ప్రకటించాడు. కానీ అప్పటికే బ్రిటీష్ సామ్రాజ్య వాద చీకటి పాలనని దేశం నుండి తరిమికొట్టాలని ఉవ్వెత్తున్న ఎగసిపడుతున్న స్వాతంత్రోద్యమ కాలంలో, అశేష త్యాగాలు చేసి దేశ దాస్య విముక్తికై పోరాటాలు చేస్తున్న ముస్లిములనూ, కమ్యూనిస్టులను శత్రువులుగా ప్రకటించడం గమనిస్తే ఆర్‌ఎస్‌ఎస్ పుట్టకలోనే బ్రిటీష్ సామ్రాజ్యవాద అనుకూలత కనబడుతుంది. లెనిన్ మహాశయుడన్నట్లు "ఉగ్రవాదం, మతోన్మాదం రెండూ సామ్రాజ్యవాదం యొక్క కవల పిల్లలే!" ఈ సూక్తికరణకు ఆర్‌ఎస్‌ఎస్ మతోన్మాద సంస్థకూడా ఏమంత భిన్నమైనదికాదు. ఎందుకంటే బ్రిటీష్ సామ్రాజ్యవాదాన్ని వణుకు పుట్టించిన ప్రజా ఉద్యమాల్లో కమ్యూనిస్టులు, ముస్లిముల పాత్ర చారిత్రాత్మకమైనది. అటువంటి వీరోచిత పాత్ర పోషించిన వారిని శత్రువులగా పరిగణించడం, వారిపై దాడులు చేయడం సామ్రాజ్యవాదానికి తొత్తులుగా మారి చేసిన ఉన్మాద చర్యలే! ఇక్కడ మరొక ఉదాహరణ చెప్పుకోవచ్చు.. ఆర్‌ఎస్‌ఎస్ మతోన్మాద సంస్థలో ముఖ్యుడు, జనసంఘ్ వ్యవస్థాపక సభ్యుడైన శ్యాంప్రసాద్ ముఖర్జీ దేశంలో ఉధృతంగా సాగుతున్న క్విట్ ఇండియా ఉద్యమాన్ని ఎలా అణచివేయాలో సలహాలిస్తు బెంగాల్ గవర్నర్ సర్ జాన్ హెర్బర్ట్‌కు ఒక సుదీర్ఘ లేఖ రాయడాన్ని పరిశీలిస్తే ఆర్‌ఎస్‌ఎస్ ఫాసిస్టు సంస్థ, పచ్చి జాతీయోద్యమ వ్యతిరేకి అని స్పష్టమౌతుంది. అంతకు ముందు స్వాతంత్రోద్యమ కాలంలోనే ధామోదర్ సావర్కర్, ఆ తరువాత వాజ్‌పేయి కూడా జాతీయోద్యమాన్ని వ్యతిరేకిస్తు బ్రిటిష్ పాలక ముష్కరులకు లొంగిపోతూ లేఖలు రాసిన విషయం అందరికీ తెలిసిందే! ఈ సామ్రాజ్యవాద లొంగుబాటే జాతీయోద్యమానికిగానీ, కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో జరిగిన అనేక చారిత్రిక పోరాటాలకు గానీ కనీస మద్దతైనా ఇవ్వకపోగా సామ్రాజ్యవాద శక్తులకు అత్యంత అనుకూలతని ప్రదర్శించింది సంఘ్. జాతీయోద్యమ కాలంలో కొన్ని ముఖ్యమైన పోరాటాలు

1. సైమన్ కమీషన్ వ్యతిరేక ఉద్యమం (1928)
2. శాసనోలంఘనోద్యమం (1930-34)
3. భగత్‌సింగ్ పోరాటాలు - ఉరి (1931)
4. క్విట్ ఇండియా ఉద్యమం (1942-44)

కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో జరిగిన కొన్ని ముఖ్యమైన పోరాటాలు

1. వర్లీ ఆదివాసీ పోరాటం (మహారాష్ట్ర 1944-47)
2. పున్నప్రవాయలార్ తిరుగుబాటు (కేరళ 1946)

3. నావికుల తిరుగుబాటు - (1946)
4. సైనికుల నిర్బంధానికి వ్యతిరేకంగా చేసిన పోరాటాలు
5. బొంబాయి పారిశ్రామిక వివాదాల చట్టం (సమ్మె హక్కు నిషేదిస్తు 1938) కి వ్యతిరేకంగా
6. తెభాగ పోరాటం (బెంగాల్ 1947)
7. జాతీయ సైనికులపై కేసులు ఎత్తివేయాలని నడిపిన పెద్ద ఉద్యమాలు
8. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం (1946-51)

1920 అక్టోబర్ 17న భారత కమ్యూనిస్టు పార్టీ తాష్కెంట్‌లో ఆవిర్భవించింది మొదలు అనేక నిర్బంధాలను ఎదుర్కొంటు ప్రజల కోసం పనిచేసింది. బ్రిటీష్ ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీపై మూడు కుట్ర కేసులు బనాయించింది. సంపూర్ణ స్వరాజ్యమే లక్ష్యమని ప్రకటించిన కమ్యూనిస్టుల వైపు యువకులు, రైతులు, కార్మికులు, విప్లవకారులు, గాంధీ నాయకత్వంలో అసంతృప్తికి గురైన ఉద్యమకారులు ఆకర్షితులైనారు. కమ్యూనిస్టులు నడిపిన వీరోచిత పోరాటాలతో మునుపెన్నడూ లేని విధంగా దేశంలో ఒక విప్లవ స్థితి ఆవహించింది. విముక్తి పోరాటాలు, సాయుధ పోరాటాలు ప్రజాపక్షం వహించి, చరిత్ర పుటల్లో నిలిచాయి. అయితే అప్పటికే సంస్థాగతంగా బలోపేత మౌతున్న సంఘ్, ఈ ప్రజాపోరాటాలను నిర్వీర్యం చేయడానికి బ్రిటీష్ పాలకులతో చేతులుగలిపి, మతఘర్షణలు రేపి, ప్రజా ఉద్యమాలకు తీరని ద్రోహం చేసింది. ఈ మురికి చరిత్ర నుండి బయటపడడానికి విప్లవకారులైన భగత్‌సింగ్, ఆజాద్, వారి సహచర కామ్రేడ్స్‌ని ఇప్పుడు తమ సొంతం చేసుకునే ప్రయత్నం చేస్తుంది. వలసవాదంకన్నా మతతత్వమే ఈ దేశానికి ప్రమాదకరం అంటూ భగత్‌సింగ్, అతని అనుచరులు మతతత్వాన్ని గట్టిగా వ్యతిరేకించారు. అయినా ఆర్ఎస్ఎస్ తమ స్వంత రాజకీయ ప్రయోజనాల కోసం నిస్సిగ్గుగా భగత్‌సింగ్, అతని అనుచరుల ప్రతిష్టని ఉపయోగించుకుంటుంది. అలాగే గాంధీని హిందూ వ్యతిరేకిగా చిత్రీకరిస్తున్నారు. హిందూ మతతత్వానికి వ్యతిరేకంగా, లౌకికతత్వానికి కట్టుబడి కఠిన పంథా తీసుకున్నాడని కక్షతో నెహ్రూని జాతి వ్యతిరేకిగా చిత్రికరిస్తున్నారు. పటేల్‌ను మాత్రం హిందూ మత కాముకుడిగా ప్రచారం చేస్తున్నారు మతవాదులు. ఇలా చరిత్రని తప్పుదారి పట్టిస్తూ వారి మతతత్వ ఎజెండాని అమలు పరుస్తున్నారు. వాస్తవ పరిస్థితిని మనం పరిశీలించినపుడు భగత్‌షింగ్, గాంధీ, నెహ్రూలాగే పటేల్ కూడా మతతత్వాన్ని, మతసంస్థలను గట్టిగా వ్యతిరేకించిన వాడే! 1947 జూన్‌లో భారత్‌ను హిందూ రాజ్యంగా చేయాలనే ప్రతిపాదన వచ్చినప్పుడు పటేల్ దాన్ని తిరస్కరించాడు. “దేశంలో మైనార్టీల పరిరక్షణ మన ప్రాథమిక బాధ్యత. కులమత విశ్వాసాలతో సంబంధం లేకుండా రాజ్యం అందరిదై ఉండాలని” స్పష్టం చేశాడు. 1948 గాంధి హత్యానంతరం “ఆర్ఎస్ఎస్ కార్యకలాపాలు రాజ్యం ఉనికికి ముప్పు తెస్తున్నాయి. మిలటరీ, సెమి మిలటరీ పంథాలో రహస్యంగా నడుస్తున్నా ఈ సంస్థ వలన మరింత ముప్పు ఉందని” ప్రకటిస్తూ హోంమంత్రి హోదాలో ఆర్ఎస్ఎస్‌ను నిషేధించాడు.

అయితే ఇంతటి చరిత్రా మత వాదులకు తెలియనిదికాదు. కాని ఆనాటి జాతీయ నాయకత్వం చేపట్టినా లౌకికతత్వం, అలీన విధానం, ప్రభుత్వ రంగం ఏర్పాటు, ప్రణాళికా సంఘం, కాశ్మీరుకు స్వయం ప్రతిపత్తివంటి అభివృద్ధికరమైన విధానాలను మతోన్మాద పాలకులు సంస్కరిస్తున్నపుడు లేదా పూర్తిగా రద్దు చేస్తున్నపుడు వస్తున్న ప్రజా వ్యతిరేకత నుండి బయట పడడానికి జాతీయోద్యమ నాయకత్వాన్ని వారి విధానాలను కించపరుస్తు, మరోవైపు భగత్‌సింగ్, పటేల్ వంటి నాయకుల కీర్తిప్రతిష్టలను వీరి మతతత్వానికి ఆపాదించుకోవడం అందులో భాగమే!

ఈ నేపథ్యం నుండి వచ్చిన మోడీ ప్రభుత్వం, దేశంలో కోవిడ్ - 19 విజృంభించి ప్రపంచంలో మూడవ స్థానానికి చేరినా అమెరికా సామ్రాజ్యవాదుల ప్రయోజనాల కోసమే ఆలోచిస్తుంది తప్ప దేశ ప్రజల ప్రయోజనాల కోసం కాదు. 2019 మార్చి నాటికి దేశంలో 1.60 వేల ప్రాథమిక ఉపకేంద్రాలు, 30 వేల ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 5,685 సామాజిక ఉపకేంద్రాలు ఉన్నాయి. వీటిలో 20% ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు 30% సామాజిక ఉపకేంద్రాలు తరుగుపడ్డాయని కేంద్ర ప్రభుత్వం లోక్‌సభలో ప్రకటించింది. 98% ఆసుపత్రుల్లో 10 మందిలోపే సిబ్బంది ఉన్నారని నీతిఆయోగ్ స్పష్టం చేసింది. 20 లక్షల మంది డాక్టర్లు, 40 లక్షల మంది నర్సుల కొరత పాలకుల నిర్లక్ష్యానికి అద్దం పడుతోంది. కోవిడ్ విస్తరిస్తున్న వేళ రోగులకు కావాల్సిన వెంటిలేటర్లు, పరీక్షలకిట్లు, ఔషధాలు, వైద్యులకు రక్షణా పరికరాలు కొరతతో కొవిడ్ రోగులు ఒకపక్క ఆత్మహత్య చేసుకున్న పరిస్థితి.

మరోపక్క వైద్య సిబ్బంది, పోలీసులు ఆశావర్కర్లు కోవిడ్ బారినపడి మరణించడం మనం చూస్తున్నాం. వైద్యరంగాన్ని కార్పొరేట్లకు కట్టబెట్టడం మూలాన ఇంతటి దారుణస్థితికి దేశం దిగజారిపోయింది. అయినా ఈ మతోన్మాద ప్రభుత్వం ఆత్మనిర్భర్ భారత్ పేరిట కీలక రంగాలను కార్పొరేట్లకు కట్టబెడుతూనే ఉంది. సామ్రాజ్యవాద విధానాలనీ, మతోన్మాద ఎజెండాని జమిలీగా అమలు చేసుకునే క్రమంలో చరిత్రని వక్రీకరిస్తోంది. తన ఉదారవాద విధానాలను సమీక్షించుకునే దిశగా అడుగులు వేయడం లేదు.

6301425450

# ఫోరెన్సిక్ రంగంలో ఆమె ముందడుగు



పిల్లలందరూ కార్టూన్ ఛానళ్లను చూస్తూ కేరింతలు కొడతారు. కానీ ఈమె మాత్రం క్రైమ్ వార్తలు, నేరపరిశోధన కార్యక్రమాలు వస్తుంటే టీవీకి కళ్లప్పగిం చేసేది. నేరస్తుడెవడు? ఏ తప్పు చేశాడు? అని తనే ముందు ఊహించేసేది. కానీ ఫోరెన్సిక్ నివేదిక రావడంతో తన ఊహలన్నీ తారుమారయ్యేవి. ఆ మలుపులన్నీ ఆమెకు ఆశ్చర్యంగా ఉండేవి. ఎప్పటికైనా తాను ఇలాంటి పరిశోధనలు చేయాలి అను కునేది కర్ణాటకలోని హుబ్లిలో జన్మించిన కార్లవాడ మహాలక్ష్మి. ఎంబిబిఎస్‌లో భాగంగా ధార్వాడలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో ఒక ఏడాది పనిచేసి తరువాత తనకెంతో మక్కువైన ఫోరెన్సిక్ కోర్సును ఎన్నిక చేసుకుంది. మొట్టమొదటి క్లాసుకు వెళ్లింది. ముగ్గురు అబ్బాయిలు మాత్రమే ఉన్నారు. తనొక్కతే అమ్మాయి ఆ క్లాసులో వుంది. అక్కడున్నవారంతా అమ్మాయిలకు ఈ రంగం సరిపోదని నిరుత్సాహ పరిచారు. తలిదండ్రులు కూడా భయపడ్డారు. కానీ వారి అంచనాలను తారుమారు చేసింది మహాలక్ష్మి. ఆమె ఆసక్తిని గమనించి ఫోరెన్సిక్ విభాగాధిపతి ఆమెకు పోస్టుమార్టం పని అప్పగించాడు. హత్యకు గురైన వారినీ, ఆత్మహత్య చేసుకున్నవారినీ ఆమె పోస్టు మార్టం చేయాల్సి వచ్చేది. ఈ నేపథ్యంలో సంఘటన స్థలానికి వెళ్లి ఆధారాలు సేకరించేది. "భయం వేయలేదా" అని అడిగితే ఆమె నవ్వేస్తుంది. ఒకసారి ఓ ప్రముఖుడు హత్యకు గురయ్యాడు. మహాలక్ష్మి రంగంలోకి దిగింది. హత్య జరిగిన సమయం, హతుడి శరీరంలో దిగిన బుల్లెట్ వివరాలను సత్వరమే అధికారులకు అందించింది. ఆ కేసులో తీర్పు చెప్పేందుకు గాను న్యాయస్థానానికి ఆమె నివేదిక ఆధారమైంది. ఇలా ఎన్నో కేసులు... ఆత్మహత్య చేసుకుందని ఒక నవ వధువును శవాన్ని తీసుకొచ్చారు. పరిశీలనగా చూస్తే చిత్రహింసలు పెట్టి చంపినట్లు, భర్తే హంతకుడని తేలింది. ప్రముఖ రచయిత కల్బుర్గి హత్య, మాజీ ఎంపి యోగేష్ గౌడ్ హత్య సంఘటనలలో నిజాలను నిగ్గు తేల్చేందుకు ఈమె నివేదికలే ఆధారమయ్యాయి. ఇలా ఆమె రెండు వేల కేసులకు నివేదికలను అందించి దోషులను పట్టించింది. రాజీవ్‌గాంధీ విశ్వవిద్యాలయం నుంచి ఎండీలో స్వర్ణ పథకాన్ని సాధించింది. ఎంత కాలమైనా ఇదే ఉత్సాహంతో పనిచేస్తా. మహిళలు ఏ రంగంలోనైనా రాణిస్తారని లోకానికి తెలియజేస్తా అంటున్నదీమె. ఇటీవలే ఈ రంగంలో కొస్తున్న యువతులకు ఈమె ఆదర్శం.

## ఒక్కరి కోసం అందరు - అందరి కోసం ఒక్కడు!

కరోనా సోకిందన్న నెపంతో తోటి వాళ్ళని వెలివేసినట్లు చూడకండి!

రేపు అదే పరిస్థితి నీకు లేక నీ కుటుంబంలో వారికో రావచ్చు. అప్పుడు నీ పరిస్థితీ అంతే అవుతుంది, అందుకే ఇప్పుడు వారిని ఆదరించి అభిమానించండి. మీరు ఉండే వీధి వాసులంతా కలిసి ఒక బృందంగా ఏర్పడండి. ఒకరికి ఒకరు తోడుగా ఉండి ధైర్యం చెప్పుకోండి. ఒక వేళ మీకో, మీ కుటుంబానికో కరోనా పాజిటివ్ నిర్ధారణ అయితే, మీ పక్క వారికి ఫోన్లో తెలియజేసి మీ కుటుంబం మొత్తం హోమ్ ఐసోలేషన్‌లో ఉండండి.

మీ పక్కింటి వారికి కరోనా పాజిటివ్ అని తెలిస్తే వారికి మిగిలిన ఇళ్ల వారు లేక మిగతా ఫ్లాట్ల వాళ్ళు ఆ 14 లేదా 15 రోజులూ కావలసిన అన్నింటినీ మీరంతా కలిసి అందజేయండి!

రోజుకొక ఫ్లాటు వాళ్ళు హోమ్ ఐసోలేషన్లో ఉన్న వారికి కావలసిన బ్రేక్ ఫాస్ట్, లంచ్, స్నాక్స్, డిన్నర్ వంటివి సిద్ధం చేసి డిస్పోజబుల్స్ లో సర్ది వారి ఫ్లాట్ డోర్ బయట వైపు పెట్టి, లోపల వున్న వారికి ఫోన్ చేయండి. బయట ఉన్న ఆహార పదార్థాలను తీసుకోమని చెబుతూ కాసింత ధైర్యమూ ఇవ్వండి.

అలా వాళ్ళ అవసరాలన్నీ తీరుతుండడంతో వాళ్ళు బయటకు వచ్చి ఇతరులకు కరోనా రోగాన్ని అంటించే ప్రమాదం ఉండదు. పైగా తమ కోసం ఇంత మంది ఉన్నారు అనే భరోసా వారిలో కలుగుతుంది.

అలాంటి అవసరం రేపటి రోజున మీకే రావొచ్చు. అందుకే మనకోసం అందరూ, అందరికోసం మనం అనుకోవాలి. **కరోనా వైరస్ ప్రబలుతున్న సమయంలో అపార్ట్ మెంట్లలో నివాసముంటున్న వారు ఈ పద్ధతిని పాటిస్తే అందరికీ క్షేమం.** మానవీయ కోణంలో ఒకరికి తోడు మరొకరు అన్నట్లుగా ఉండడం నేర్చుకుందాం. ఆచరిద్దాం..!

విశ్రాంత ఆచార్యులు రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి

# అంతఃపురోపన్యాస కథలు



'అంత:పురోపన్యాసము' అనే పేరుతో ఆచంట సుందరరామయ్య గారు నాలుగు భాగాలుగా ఒక కథ రాశారు. వాటిని నాలుగు వరుస కథలని అనుకోవచ్చు. అవి 'చింతామణి' పత్రికలో 1896 జూన్, 1897 సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ నెలల్లో వరుసగా వచ్చాయి. అవి ఉపన్యాసరూపంలో ఉన్న కథలు. అంత:పురం అంటే పడకటిల్లు. మొదటికథ మొదట్లోనే రచయిత 'గయ్యాళియగు భార్య తన భర్తకు రాత్రులు పాన్పుపై జేసిన యుపన్యాసములు' అని చెప్పారు. భార్య తనంతట తాను గయ్యాళి కాలేదు. తన భర్త బాధ్యతారహిత ప్రవర్తన వల్ల తాను నోరుబెట్టుకొని బతకవలసి వచ్చింది.

ఈ కథల్లో భర్త రాత్రిపూట ఇంటికి వచ్చి తిని పడకమీద పడుకున్నాక భార్య అతని ప్రవర్తనను అధిక్షేపిస్తూ కఠినంగా మాట్లాడుతుంది. ఇది ఇంట్లో వచ్చిన తిరుగుబాటే. సంఘ సంస్కరణోద్యమం కొనసాగుతుండగా, స్వాతంత్ర్యోద్యమం రూపుదిద్దుకుంటున్న కాలంలో ఈ కథలు వచ్చాయి. భర్త చేస్తున్న చెడ్డ పనులను ఎత్తిచూపి వాటి నిష్ప్రయోజకత్వాన్ని నిరూపించి, కఠినమైన మాటలతోనైనా భర్తను సంస్కరించుకోవడం ఈ కథల లక్ష్యం. ఈ కథల్లోని భార్యాభర్తలు గోదావరి ప్రాంత బ్రాహ్మణులు. మూడో కథలో 'నేడు కార్తీక సోమవారము. గోదావరి స్నానము లేదు. గుడిలోనికి బోవుట లేదు. సంధ్యావందన మదివరకే సన్నగించినది.' అంటుంది భార్య. అంటే మొగవాడు సంప్రదాయ జీవితానికి దూరమయ్యాడని అర్థం. పోనీ సంప్రదాయానికి స్వస్తి చెప్పి ఆధునికుడై సమాజానికి ఉపయోగపడుతున్నాడా అంటే అదీ లేదు. అతను ఎన్ని రకాలుగా చెడ్డాడో ఈ కథలు చెబుతాయి. ఈ భర్త ప్రాచీన తెలుగు సాహిత్యంలో గుణనిధి, సుకుమారుడు, నిగమశర్మలకు పందొమ్మిదో శతాబ్దపు వారసుడు. చెడ్డదారి పట్టిన భర్తను నయానో భయానో మార్చడానికి భార్య ప్రయత్నిస్తుంది. ఈమె నిగమశర్మ అక్క లాగా నాజూకుగా చెప్పదు. రోగానికి తగిన మోతాదులోనే మాట్లాడుతుంది. ఈ కథలు సామాజిక వ్యవస్థ పురుషులకు అనుకూలంగా, స్త్రీలకు వ్యతిరేకంగా ఉన్న వాస్తవికతను ప్రతిఫలిస్తాయి.



ఈ కథల్లోని దంపతులది సామాన్య కుటుంబం. పరిమిత ఆదాయం గల కుటుంబం. భర్త అలవాట్లు ఇంటిని గుల్ల చేసే ఖరీదైనవి. వాళ్ళకు పిల్లలున్నారు. భర్త భార్యను, పిల్లలను పట్టించుకోడు. పగటిపూట అందుబాటులో ఉండడు. రాత్రిపూట మాత్రమే ఇంటికి వస్తాడు. భార్యకు భర్తతో మాట్లాడడానికి అదే సమయం. అతనికి బిలియర్డ్స్ అనే ఖరీదైన ఆట ఆడడం, పరాయి స్త్రీ వ్యామోహం, నాటకాలకు పోవడం, వాటికి చందాలివ్వడం, ప్రశ్నించే భార్యను దబాయించడం - ఇవీ అలవాట్లు. వీటివల్ల ఇల్లు ఆర్థికంగా చితికిపోతున్నది. సంసార జీవితం సజావుగా సాగడం లేదు. భార్య ఒక్కొక్క కథలో ఒక్కో వ్యసనం మీద దాడి చేస్తుంది. మొదటి మూడు కథల్లో భార్య ఎంత తీవ్రంగా మాట్లాడినా అతను స్పందించడు. పడుకొని నిద్రపోతాడు. బహుశా అతని లోపల మథనం జరుగుతూ ఉంటుంది కాబోలు. నాలుగో రోజు భార్య మాట్లాడిందంతా విని తాను మారడానికి నిర్ణయించుకుంటాడు.

మొగవాళ్ళ ఆగడాల మీద ఆడవాళ్ళు అనేక రకాలుగా తిరుగుబాటు చేయడం అప్పట్లో చాలా కథల్లో కనిపిస్తుంది. ఈ కథల్లో భార్యకు తమ ఆదాయం, ఇంటి అవసరాలు, సామాజిక స్థితిగతులు... వీటిపట్ల మంచి అవగాహన ఉంది. తన భర్త మారితే తప్ప కుటుంబం బతికి బట్టకట్టదు అని ఆమెకు తెలుసు. అందుకే ఆమె నోరు తెరిచింది. ''మగవాడేమి చేసినను తప్పులేదు'' అంటూ వ్యవస్థ మొగవాళ్ళకు అనుకూలంగా ఉండడం ఆమెకు తెలుసు. అది ఆమె చైతన్యానికి నిదర్శనం. రెండవ కథలో తన భర్త ఆకర్షితుడౌతున్నది ఒక బాల వితంతువు పట్ల అని తెలుసుకొని, ఆమె అసమ వివాహ వ్యవస్థ మీద విమర్శ చేస్తుంది. ఆ వితంతువు అన్న ఆమెకు

అతి చిన్న వయసులోనే డబ్బుమీద ఆశతో యాభయ్యేళ్ళ వ్యక్తితో పెళ్లి చేస్తాడు. దీనిని ప్రస్తావించిన భార్య తీవ్రంగా విమర్శిస్తుంది. "చావుకు సిద్ధమై, తల నెరిసి, మనుమల నెత్తి, కూర్చున్నచోట నుండి లేవలేనివాడైనను మగవాడు తిరిగి వివాహమాడవచ్చునట. నోరు వాయి లేని ఛిన్నపిల్లకు వైధవ్యమిప్పించవచ్చునట. సంసార సౌఖ్యముల నెరుగక, ప్రపంచ జ్ఞానము లేక సప్తపాదములలో వైధవ్యము పొందిన బాలవితంతువయినను పునర్వివాహ మాడగూడదట. ఆహా! ఏమి యీ శాస్త్రములు. ఈ వెధవ తాటియాకు వ్రాతలు తగలబెట్టినట్లే యున్నవి. ఈ శాస్త్రములు ఆండ్రవారే చేసిన యెడల యింత పాడుగా నుండునా?" అంటుందామె. హక్కులలో ద్వంద్వనీతిని ఎత్తిచూపడం ఒక ఎత్తైతే, ఆధిపత్యంలో ఉన్నవాళ్ళు రాసే శాసనాలు వాళ్ళకు అనుకూలంగానూ, ఇతరులకు వ్యతిరేకంగానూ ఉంటాయన్న రాజనీతి రహస్యాన్ని బయట పెట్టడం మరో ఎత్తు. ఈ రెండు పాయింట్లూ ఇప్పటికీ ఎంతో విలువైనవి. అసమ సమాజంలో శాసనం పీడితులే చేయాలనడం 1896 నాటికి ఎవరైనా ఊహించగలమా? ఈ కథలు కేవలం సాంఘిక కథలు కావు. వీటికి రాజకీయ స్వభావముంది. ఇదొక కొత్త చూపు. కర్ర ఉన్నవాడిదే బర్రె అనే న్యాయం మీద తిరుగుబాటే ఈ కథలు.

మొదటి రెండు కథల్లో భర్త దురలవాట్ల మీద తీవ్రమైన విమర్శ పెట్టింది భార్య. "ఈ బంతులాట వలన ప్రయోజనమేమో నాకు దెలియకున్నది", "మీరేపని జేసినను సరేకాని బిలియర్డ్సు ఆడితే మాత్రము నేను సహించను" అంటుంది మొదటి కథలో. రెండోకథలో "మీరు చదివిన చదువు తగలబెట్టనా! పరదారా గమనము పాపహేతువని మీరు బాల్యముననందే చదివియున్నారే. ఈ చదువులన్నియూ సన్నమైనవి గాబోలు." అని దెప్పిపొడుస్తుంది. భర్తలో మార్పు కనబడలేదు. మూడోరోజు "మీరు నాకు మేరుపర్వతము నిచ్చినను నేను మీతో కాపురము చేయలేను" అని కుండ బద్దలు కొట్టినట్లు చెబుతుంది. చొక్కా గుండీ ఊడిపోతే దానిని భార్య కుట్టలేదని భర్త దబాయించి ఉంటాడు. గుండీ విషయం సాకు మాత్రమే. మొదటి రెండు రాత్రులూ భార్య చేసిన విమర్శకు రియాక్షనే గుండీ మీద మిషపెట్టి దబాయించడం. అందుకే ఆమె పూర్తిగా తిరుగుబాటు జెండా ఎగురవేసింది. "మీబొత్త ములన్నియు నూడి పోవును. నేను వానికొక దారమైనను గ్రుచ్చను. బొత్తములన్నియు బోయిన వెనుక మీరేమి చేయుదురో చూచెదను" అని దబాయించి చెబుతుంది. నాలుగో రోజు చివరి అస్త్రంగా తాను తన పుట్టింటికి వెళ్ళిపోతున్నట్లు ప్రకటిస్తుంది. "రేపటి దినము నేను మాయమ్మగారింటికి బోయెదను. మీ స్నేహితురాండ్రతో మీరప్పుడు స్వేచ్ఛగా నుండవచ్చును." గురజాడ 'దిద్దుబాటు' కథలో కమలిని ఇలాగే అంటుంది. మూడవ కథలో స్త్రీలను మొగవాళ్ళ సపర్యలకే పరిమితం చేయడం మీద భార్య విరుచుకు పడుతుంది. "భార్యలెప్పుడును భర్తల వస్త్రములు, పాదరక్షలే కుట్టవలసివచ్చిన పక్షమునకు, వారికి భర్తలు లేకుండుటయే మేలు." అని తీవ్రంగా మాట్లాడుతుంది.

**ఉపన్యాసాల రూపంలో ఉన్న ఈ కథలు గ్రాంథిక భాషలో ఉన్నాయి. శిల్పపరంగా తొలిదశలో ఉన్నా, భార్య దృష్టికోణం నుండి, ఆమె కంఠస్వరం నుండి పురుషాహంకారం మీద విమర్శ చేయడంలో మాత్రం ఇవి ఈనాటికీ విలువను కోల్పోలేదు. ఈ విమర్శనాత్మక వాస్తవికతే ఆధునిక సమాజాన్నీ, ఆధునిక సాహిత్యాన్ని నడిపిస్తున్నది. నేటి స్త్రీవాద మూలాలను కూడా ఈ కథల్లో మనం అన్వేషించవచ్చు.**

వివినమూర్తిగారు 1910 నాటి 'దిద్దుబాటు' కన్నా ముందు వచ్చిన 92 కథలను సేకరించి 'దిద్దుబాటలు' పేరుతో ప్రచురించారు. అందులో అయిదు కథలు రుతువులు కేంద్రంగా రాయబడినవి ఉన్నాయి. అవి 1.ఒక సంవత్సరము పల్లెటూరియందునికి లేక ఋతుచర్య. 2. గ్రీష్మ ఋతువు. 3.వర్ష ఋతువు 4. శరదతువు 5. హేమంత శిశిరములు. "దీనిని కచ్చితమైన తొలి తెలుగు కథావరుస" అన్నారు వివిన మూర్తి గారు. ఈ కథలు 'జన వినోదిని' అనే పత్రికలో 1882 జూలై, సెప్టెంబర్, నవంబర్, 1883 ఫిబ్రవరి, ఏప్రిల్ నెలల్లో ప్రచురితమయ్యాయి.

మనకు ఒక పాత్రను, ఒక స్థలాన్ని కేంద్రంగా చేసుకొని ఒకే రచయిత అనేక కథలు రాసే సంప్రదాయం ఇరవయ్యవ శతాబ్దంలో కనిపిస్తుంది.

ఉదా : 1. వటీరావు కథలు : చింతాదీక్షితులు, 2. కోనేటిరావు కథలు : శ్రీశ్రీ, 3. కాంతం కథలు : మునిమాణిక్యం నరసింహారావు, 4. అత్తగారి కథలు : భానుమతీ రామకష్ణ, 5. అమరావతి కతలు : సత్యం శంకరమంచి, 6. పెన్నేటి కతలు : పి.రామకష్ణారెడ్డి, 7. గోదావరి గాథలు : ఫణికుమార్, 8. మాదిగోడు : నాగప్పగారి సుందరరాజు, 9. ఊరు : కెవి నరేందర్... మొదలైనవి.

వీటిని వరుస కథలు అనవచ్చునేమో! కథావరుస అన్నారు మూర్తి గారు. ముత్యాలసరాలు లాగా కథాసరాలు అని కూడా అనవచ్చు. ఈ రకం కథలకు, ఈరకం కథాసంప్రదాయానికి మూలాలు పైన పేర్కొన్న అయిదు కథల్లో ఉన్నాయి. వాటికన్నా మరికొంత స్పష్టమైన రూపంలో 'అంత్ఃపురోపన్యా సము'లలో ఈ లక్షణాలు ఉన్నాయి. ఈ కథలను వెలుగులోకి తెచ్చినవారు వివిన మూర్తి గారు. ❖

డా. కనుపర్తి విజయ బక్ష్

# కరోనా కారుణ్యం

అమ్మా ! ఈ కరోనా వచ్చిన కాడ్నించి హాయిగా వుందమ్మా. మా వోడు మందు మానేసి బుద్ధిగా ఇంటికాడ తొంగుంటున్నాడు. పనులేవి లేవు కదమ్మా... అయినా నాకు దిగు ల్లేదు. రోజులు బాగానే ఎల్లమారుతున్నాయి...!

మల్లి మాటలు వింటుంటే నాకు జాలేసింది. నేనిచ్చిన టీ తాగుతూ, ఎదురుగా కూర్చుని ఇంత హాయిగా మాట్లాడటం తాను పనిలోకి వచ్చిన ఈ నాలుగేళ్ళ తర్వాత ఇదే నేను చూడటం. మంచి పని మనిషి కోసం వెతుకుతుంటే తానే వచ్చింది. ఆమె పక్క వాళ్ళింట్లో పని చేసేది. వాళ్ళు ట్రాన్స్‌ఫరయి వేరే ఊరెడుతున్నారనీ, పని కావాలంటూ వచ్చింది. నాకు నచ్చినట్లు అన్నీ తాను చక్కగా, శుభ్రంగా, ఒద్దికగా చేయటంతో నేను నిశ్చింతగా తనకు ఇల్లు అప్పగించాను. దొంగ బుద్ధి లేదు. అబద్ధం ఆడదు. అంత మంచి మనిషిని వదులుకో లేక నేను చూసీ చూడనట్లు అన్నీ దండిగా ఇచ్చేదాన్ని. జీతం కూడా బాగా పెంచాను. ఇద్దరు పిల్లలు. అమ్మాయి ఏడు, అబ్బాయి నాలుగు చదువుతున్నారు గవర్నమెంటు బళ్ళో. మల్లి మొగుడు కూలీ పన్లకు వెళ్తాడు. ఐదారొందలు రోజుకు వచ్చినా ఇంట్లో ఇచ్చేది తక్కువే. తాగేందుకు తగలేసేది ఎక్కువ. అందుకే ఈ కరోనా టైమ్‌లో మద్యం షాపులు మూతపడటంతో మేలు జరిగింది తన కుటుంబానికి అనుకొంటున్నది. తన ఆలోచన తప్పేమో అనిపించింది. కరోనా మహమ్మారి సృష్టిస్తున్న విలయం తనకు అర్థం కాదు కదా అనుకొన్నాను. మల్లిలో వున్న ఈ చిన్న పాటి స్వార్థాన్ని తప్పు పట్టినందుకు నన్ను నేనే నిందించు కొన్నాను. దేశాన్ని తమ తమ అవసరాల కోసం దోచుకు తింటున్న రాజకీయ నాయకులు నా ఆలోచనల్లోకి వచ్చారు. పాపం ఒక నిస్స హాయురాలు, అమాయకురాలు అయిన స్త్రీ తన కాపురం బాగుండాలని అట్లా కోరుకోవటంలో తప్పేముంది అనిపించింది.

“అయితే మల్లీ! ఇట్లా బాగుందంటావా?” అడిగాను.

“ఔనమ్మా! ఇంట్లో గొడవల్లేవు. తాగొచ్చి వుత్త పున్నానికే కొడుతుండేవాడు. నోటి కొచ్చిన బూతులు తిట్టేవాడు. పిల్లల్ని సదువుకోనీయకుండా తిట్టి పోసేవాడు. అల్ల ఏడ్పులు, నాబాధ, రేతిరంతా నిదరుండేది కాదమ్మా! ఇది వచ్చిన కాడ్నించి కడుపు నిండ యింత తిని, కంటి నిండా నిద్రోతున్నాం.” మల్లి మాటల్లో ఆనందం.

“మరి మీ ఆయనకి పనులు లేవుకదా! సంసార మెట్లా గడుస్తుంది?” అడిగాను.



“అబ్బో ఆడు సంసారాన్ని తెగ నడిపేవాడు అంతకు ముందు.. మీరిచ్చే జీతం, ఎదురింట్లో వాళ్లిచ్చే జీతం అట్టుకెల్లి ఇంటి అద్దె, కరెంటు బిల్లు కట్టి మిగిలిన దాంట్లో ఎచ్చాలు తెత్తానమ్మా. పిల్లలు బడికి, వాడు కూలీకెల్తారు గందా. మద్దినాల మా యింటికాడ పప్పులు (పిండి వంటలు) వండే ఆమెకి సాయంజేత్తా. ఆమె నెలకి మూడేలు యిస్తాది. రేషను బియ్యం వత్తాయి. మీరు, ఆరు బెట్టే కూరలు నారలతో అట్టా ఏదో నడిపేత్తున్నా. నా మొగుడు తాగొచ్చి కోడో.. కొక్కిరాయో వండమంటే వండుతా. ఆడికి మూడున్న రోజు బిర్యానీలు తెత్తాడు. ఏం తిన్నా ఏం తాగినా ఇంటికాడ గొడవ లేకుండా ఉంటే చాలురా భగమంతుడా అని దన్నం పెట్టు కొంటా. పిల్లలు అడిలి పోతున్నారమ్మా...!” మల్లి ముఖంలో భయం కనిపించింది.

“అయితే ఈ నెల రోజుల నుంచీ బాగుందంటావు. మీ ఆయన పన్లోకి వెళ్ళటం లేదనీ, పనులు లేవనీ బాధ పడటం లేదన్న మాట.”

“బాదెందుకమ్మా? మీ దగ్గర ఐదేలు తీసుకున్నానా? ఆటితో ఈ నెల నెట్టేశాను. ఆడు పనికెళ్లినా నా చేతికి అంత వచ్చేదా! అడిట్టమై ఏది తెస్తే అది తీసుకోవటమే..!”

మల్లి మాటలు వింటుంటే, జాలేసింది

“మరి ఇంత పని చేస్తున్నావూ, ఉదయం నుంచీ సాయంకాలం వరకూ నీకు అలసట రాదా? ఎవరి మీదా కోపం రాదా? మొగుడు రోజూ కొడుతూ, తిడుతున్నా అంతేనా?” నా మాటల్లో కొద్దిగా ఆవేశం.

మల్లి నవ్వింది. వెటకారంగా నవ్వింది. ఎవరినుద్దేశించో? ఎందుకో??

“ఎవర్ని కోపగించుకోవాలమ్మా! మా వాళ్లందరి బతుకులూ సుమారుగా ఇట్లనే వుంటాయి. మా అయ్య తాగి తాగి తొందరగానే సచ్చాడు. మా అమ్మ మమ్మల్ని సాకటానికి పనులు చేసి చేసి ఆరోగ్యం భాగా లేక సచ్చింది. మా తమ్ముడు రిచ్చా నడుపుతాడు. ఆడు తాగుతాడు. ఆడి సంసారమే అంతంత మాత్రం. ఇక నా బాధలు ఎవరితో సెప్పుకోను. నా మొగుడి మీద అలిగి నేను బలవంతంగా సచ్చాననుకో నా పిల్లలు అనాదలయి పోతారు. ఆరిని సదివించి ఏదో ఒక చిన్నదో, చితకదో ఉద్యోగమో, మంచి పన్లోనో పెట్టాలమ్మా. అదే నా కోరిక.” చెమ్మగిల్లిన కళ్లను మల్లి తుడుచుకుంది.

మల్లి పిల్లల పట్ల తనకున్న ప్రేమను రకరకాలుగా వెల్లడించేది. ఆరు నూరైనా, నూరు ఆరైనా పిల్లల్ని బడికి పంపటం ఆపను అనేది. అందుకే నేను ప్రతి సంవత్సరం ఇద్దరు పిల్లలకీ చదువుల కోసం ఎంతో కొంత ఇస్తుంటాను. లాక్‌డౌన్ కాలంలో మల్లిలో కొత్త ఉత్సాహం చూస్తున్నాను. ఎప్పుడూ

ఎదవ పెబుత్వాలు ఎన్ని మాటలు చెప్పాయి. సారాయి వుండదు అని.. ఇది తీసేయరమ్మ. ఎలక్షన్లు వస్తే సారా మీటింగులు పెడితే వచ్చే జనానికి సారా. గెలవకముందు సారా, గెలిచినాక సారా దేముల్ల, దయ్యాలు, నీతి, అవినీతి, పెజలు, పేమలు బోల్డన్ని కబుర్లు సెబుతారు అందరు. ఎవరికీ దయలేదు. ఎవరు చూపని దయ ఆ కరోనా చూపింది. తాగబోతుల నోటికి తాళం వేసింది..



కలతగా, ఆదుర్దాగా వుండే ముఖం ముసి ముసి నవ్వులతో ముచ్చటగా వుంది. నేనిచ్చే కూరలు, పప్పులు వాళ్లయనకు ఇష్టం అనటంతో, సాంబారు, పప్పులు కొంచెం ఎక్కువ మోతాదులో వండి తనకు ఇస్తున్నాను. నేను రోడ్డు మీదికి వెళ్లి కూలీలనూ, బీదలనూ ఆదుకోలేకపోయినా ఒక్క కుటుంబానికయినా సాయపడుతున్నానని తృప్తిగా వుంటోంది.

మల్లి మాటల్లో, అలంకరణలో ఇప్పుడు బాగా తేడా కనపడుతోంది. తల శుభ్రంగా దువ్వుకోవటం, చీర పొందికగా కట్టుకోటం, మా వాకిట్లో ఏ మందారమో, గులాబో చటుక్కున తెంచి తల్లో పెట్టుకోవటం చూచి సంబరమేస్తోంది. కరోనా కష్టాలు ఎన్నింటినో వింటున్న, చూస్తోన్న నాకు మల్లి కుటుంబం మద్యం షాపులు మూతబడటంతో ఎంత సంతోషంగా వుందో చూచి ఆశ్చర్యపోతున్నాను.

అయితే నా అనందం ఆవిరై పోవటానికి ఎంతో కాలం పట్టలేదు. టీవీ ఆన్ చేసిన నాకు – మద్యం షాపులు తెరవటానికి ప్రభుత్వం అనుమతివ్వటమే ఆలస్యం, బెల్లం చుట్టూ ఈగలు మూగినట్లు వరుసా, వావీ లేకుండా జనాలు తండోపతండాలుగా వచ్చి షాపుల మీద ఎగబడటం కనిపించింది.

ఇప్పటి వరకూ టీవీల్లో భౌతిక దూరం అనీ, మాస్కులనీ, చేతులు శుభ్రంగా కడుక్కోవాలనే సూక్తి ముక్తావళి అంతా ఎటుపోయిందో అర్థం కాలేదు. ప్రభుత్వానికి ఆదాయం రావాలి. అతి సులభంగా ఆదాయం కూడే వనరుల్లో మద్యం ముఖ్య మైంది. ప్రభుత్వం తనకు లాభసాటయిన మద్యం షాపులు తెరిచేందుకు ఎక్కడ లేనీ ఆసక్తి చూపింది. ప్రజల పట్ల ప్రేమ పొంగి పొరలే మాట్లాడే ప్రభుత్వాధినేతల 'ఆషాఢ భూతి' వ్యవహారం అసహ్యం కలిగిస్తోంది.

నా మదిలో ఎందుకో చటుక్కున మల్లి ఆలోచన వచ్చింది. ఆ రోజంతా మల్లి పనిలోకి రాలేదు. ఆ మర్నాడు వచ్చింది. పాలిపోయిన ముఖం, రేగిపోయిన జుట్టు, వాచిపోయిన పెదవులు, నుదిటి మీద దెబ్బ ...! ఇది మల్లేనా? ముసిముసి నవ్వులు.. పూలు, చిన్నపాటి కులుకులు ఏమయ్యాయి?

"మల్లీ అట్లా ఉన్నావేంటి? ఒంట్లో బాగులేదా? అడిగాను.

అంతే! ఆ శోకదేవత కళ్ల నుంచి పారుతున్న కన్నీటి ప్రవాహంలో ఈ ప్రభుత్వాలు కొట్టుకపోతే బాగుండు అనిపించింది. వెక్కివెక్కి ఏడ్చింది. తన దు:ఖ భారం పోయే వరకూ నేను ఏం మాట్లాడలేదు. వేడి వేడి టీ యిచ్చాను.

"అమ్మా, మా బతుకులింతేనా? ఇక మారవా! అంటూ మల్లి మరోమారు ఏడ్చింది.

"సారాయి సాపులు తెరిచారని తెల్వటం ఆడు పోయి కీలో నుంచొని సీసాలు కొనుక్కున్నాడు. మొన్న పెబుత్వం యిచ్చిన యెయి రూపాయలు పెట్టిలో అడుగున దాచినా! వాట్ని తీసుకొని ఎల్లాడు. పొట్ట పగిలేలా తాగాడు. మళ్ళీ వచ్చి డబ్బు ఎక్కడ దాచావో తియ్యి అంటాడు. నేనెక్కడ నుంచి తేను. గవర్నమెంటోడు యిచ్చింది వెయ్యేకదా? ఇంకోసారి యిత్తే నువ్వే తీసుకో. నా పిల్లలకి యింత బువ్వ పెట్టడానికి నేను తెచ్చిన డబ్బులెట్ట యిత్తాను అన్నాను. ఇదిగో తల్లీ ఇట్టా బాదాడు" అంటూ ముఖం మీద దెబ్బలు, చేతులకి పగిలిపోయి గుచ్చుకున్న గాజుల గాయాలు చూపింది. మల్లి ఆక్రోశం అంతా ఇంతా కాదు. నాకు ఉక్రోషం వచ్చింది.

**"అమ్మా! ఎదవ పెబుత్వాలు ఎన్ని మాటలు సెప్పినారు! సారాయి వుండదని.. దాన్ని తీసేయరామ్మా? ఎలక్షన్లు వస్తే సారా, మీటింగులు పెడితే వచ్చే జనానికి సారా, గెలవకముందు సారా, గెలిచినాక సారా దేముల్ల, దయ్యాలు, నీతి, అవినీతి, పెజలు, పేమలు బోల్డన్ని కబుర్లు సెబుతారు అందరూ. ఎవరికీ దయలేదు. ఎవరూ చూపని దయ ఆ కరోనా రోగం చూపింది. తాగబోతుల నోటికి తాళం వేసింది.** అమ్మా! నా పెళ్లయినాక ఓ సంవచ్చరమంతా, ఈ రెండు నెలలు ఇదే నేను నా మొగుడితో గడిపిన జీవితం. మిగతాదంతా ఏడుపే. జీవితంలో సంతోసమిచ్చిన ఆ 'కరోనా'కి ఒక దండం పెడుతున్నా.

నేను అవాక్కయి నోట మాట రాక, అట్లాగే మల్లి కేసి చూస్తుండి పోయా!

**సెల్ : 9441382303**



# ఉద్యమ కెరటం - లక్ష్మీ సెహగల్

**జూ**లై 23 కెప్టెన్ లక్ష్మీ సెహగల్ వర్ధంతి సందర్భంగా ఆమె కుమార్తె, ఐద్వా పూర్వ జాతీయ అధ్యక్షురాలు, సిపిఎం పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యురాలు సుభాషిణీ అలీ గారిచే ఐద్వా విశాఖ నగర కమిటీ ఆధ్వర్యంలో నిర్వహించిన ఆన్‌లైన్ కార్యక్రమంలో ఇచ్చిన స్మారకోపన్యాసం.

లక్ష్మీ సెహగల్ 24 అక్టోబర్ 1914వ సంవత్సరంలో స్వామినాథన్, అమ్ము స్వామినాథన్ దంపతులకు జన్మించారు. ఈమె లక్ష్మీ పూజ రోజు జన్మించిన కారణంగా లక్ష్మీ అని ఆమె తండ్రి నామకరణం చేసారు. చిన్న నాటి నుండి చదువులో ముందు వుండే వారు. సామాజిక అంశాలపై వాళ్ళ అమ్మమ్మతో ఘర్షణ పడుతుండేవారు. తన తల్లి అమ్ము స్వామినాథన్ ప్రభావంతో స్వాతంత్ర్య ఉద్యమాల పట్ల ఆకర్షితులైనారు. తను చదువుకొనే రోజులలో జాతీయోద్యమంలో పాల్గొనేవారు. అనంతరం సింగపూర్ వెళ్ళారు. అక్కడ వైద్య వృత్తిని చేపట్టారు. అక్కడ నివశిస్తున్న భారతీయులకు ముఖ్యంగా వైద్య సేవలను అధికంగా అందించేవారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో క్షతగాత్రులైన ఎంతో మందికి ఎన్ని అడ్డంకులు అవరోధాలు వచ్చిన ధైర్యంగా వైద్యం అందించారు. సింగపూర్‌లో కొంత మంది భారతీయులు భారతదేశానికి స్వాతంత్ర్యం సాధించటం కొరకు తమ వంతు భాగస్వాములవ్వాలని నిశ్చయించు కొన్నారు. దానిలో భాగంగా వారంతా కలిసి ఇండియన్ నేషనల్ ఆర్మీని ఏర్పాటు చేసారు. సింగపూర్‌లో వచ్చిన కొన్ని సమస్యలను అధిగమించడం కష్టతరంగా భావించిన ఆ బృందం సుభాష్ చంద్రబోస్‌కు ఈ ఇండియన్ నేషనల్ ఆర్మీకి నాయకత్వం వహించాల్సిందిగా అభ్యర్ధించారు. దానికి స్పందించిన బోస్ సింగపూర్ విచ్చేశారు. ఆ సందర్భంగా ఇండియన్ నేషనల్ ఆర్మీ వ్యవస్థాపక బృందం, లక్ష్మీ సెహగల్ ఆమె మిత్ర బృందం బోస్‌ని కలిసారు. బోస్ ఒక కీలక అంశాన్ని ప్రతిపాదించారు. ఏ ఉద్యమంలో నైనా మహిళల పాత్ర చాలా కీలకం, మహిళలు పాల్గొన్న ఉద్యమాలు విజయవంతమవుతాయి కాబట్టి మనం కూడా ఝాన్సీ లక్ష్మీ భాయి పేరున ఒక మహిళా బృందాన్ని తయారు చేసుకోవాలని చెప్పారు. దానికి స్పందించిన లక్ష్మీ సెహగల్ ఆమె స్నేహితులని కలుపుకొని లక్ష్మీ భాయి రెజిమెంట్‌లో చేరుతారు. లక్ష్మీ సెహగల్ ధైర్య సాహసాలకి మెచ్చుకొని సుభాష్ చంద్రభోష్ ఆమెను కెప్టెన్‌గా నియమించారు. జాతీయోద్యమ కార్య కలాపాలలో మతాలకి అతీతంగా అందరూ పాల్గొన్నారు. అందువలనే బ్రిటీష్ ప్రభుత్వం లక్ష్మీ సెహగల్‌ను ఆమెతో పాటు ఒక హిందు, ఒక ముస్లిం, ఒక సిక్ మతాలకి చెందిన జాతీయ నాయకులను కూడా అరెస్టు చేసి కోర్టుకు హాజరు పరచింది. ఆ అరెస్టుకు వ్యతిరేకంగా దేశ ప్రజలు పెద్ద ఎత్తున నిరసన తెలియజేసారు. చివరకు జవహర్‌లాల్ నెహ్రూ సైతం నల్లకోటు ధరించి కోర్టుకు హాజరైయ్యారు. విడుదల అనంతరం లక్ష్మీ సెహగల్ ప్రేమ్ సెహగల్‌ను మార్చి 1947లో లాహోర్‌లో వివాహమాడారు. అనంతరం దేశ విభజనకు జరుగుతున్న చర్చలను వ్యతిరేకించారు. అయినప్పటికీ దేశ విభజన అనివార్యమైంది. దానితో వారు కాన్పూరుకు మారారు.

స్వాతంత్ర్యం అనంతరం లక్ష్మీ సెహగల్ ఆమె వైద్యవృత్తిని కొనసాగించారు.

లక్ష్మీ సెహగల్‌కు కమ్యునిస్టులంటే అభిమానం ఉన్నప్పటికీ భారతదేశ కమ్యునిస్టులు సుభాష్ చంద్రబోస్‌ను అక్కున చేర్చుకోలేదని అందుకని ఆ పార్టీలో చేరలేకపోతున్నానని అన్నారు. బంగ్లాదేశ్ యుద్ధంలో క్షతగాత్రులైన శరణార్ధులకు వైద్యసేవల నిమిత్తం అప్పటి బెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతిబసు బెంగాల్ రావాలని లక్ష్మీ సెహగల్ కు వర్తమానం పంపారు. దానికి బదులుగా ఆమె సుభాష్ చంద్రబోస్‌ను మీరు గుర్తించిన నాడే వస్తానని కబురు పంపుతారు. దానికి స్పందించిన జ్యోతిబసు భారతదేశ స్వాతంత్ర్య సాధనలో సుభాష్ చంద్రబోస్ సేవలను కొనియాడుతూ ప్రకటన విడుదల చేస్తారు. దానిని చూసిన లక్ష్మీ సెహగల్ బెంగాల్ వెళ్ళి శరణార్థులైన క్షతగాత్రులకు సేవలందించిన **వైద్య బృందానికి నాయకత్వం వహించారు. ఆ తరువాత మహిళా ఉద్యమాలలో తనదైన పాత్ర నిర్వహించారు. దేశంలో చోటు చేసుకుంటున్న మతతత్వాన్ని వ్యతిరేకించారు. నేడు లక్ష్మీ సెహగల్ బ్రతికి ఉంటే భారత దేశంలో నేడు చోటు చేసుకున్న కరోనా పరిణామాలలో తన వంతు వైద్య సేవలందించి ఉండేవారు. నేడు భారత దేశం వైద్యానికి కేటాయించిన ఒక శాతం కేటాయింపులు చూసి బాధపడి వుండేవారు** అని సుభాషిణీ అలీ తన ఉపన్యాసాన్ని ముగించారు.

జి. నిర్మలారాణి




" A daughter always remains a lovely daughter. A son is a son until he gets a wife. A daughter is a daughter throughout her life" ఈ మాటలు అన్నది ఎవరో కాదు, ముగ్గురు జడ్జీల బెంచ్‌కి నాయకత్వం వహించిన జస్టిస్ అరుణ్ మిశ్రా.

హిందూ వారసత్వ చట్టంలోని సెక్షన్-6 ( 1 ) ప్రకారం తండి ఆస్తిలో కూతురుకూ సమానహక్కు, సమానవాటా ఉంటుందని, జస్టిస్ అరుణ్ మిశ్ర, జస్టిస్ ఎస్. నజీర్, జస్టిస్ ఎం. ఆర్.షాలతో కూడిన త్రి జడ్జ్ బెన్చ్ సంచలనాత్మక తీర్పును ఇచ్చింది.

2005, సెప్టెంబర్ 9 నాటికి తండ్రి బ్రతికి ఉన్నా, మరణించినా కుమార్తెకు సమాన హక్కు, సమానవాటా ఇచ్చి తీరాల్సిందేనని సుప్రీంకోర్టు వెల్లడించింది.

తండ్రి ఆస్తి విషయంలో ఆడపిల్లల సమాన హక్కు నేపద్యాన్ని చూద్దాము.

మనందరికీ గుర్తు ఉండేవుంటుంది, దీనికి ఆధ్యుడు ఎన్‌టి రామారావు అని. 1985 సెప్టెంబరు 5 అప్పడి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఎన్.టి.ఆర్. మహిళలకు ఆస్తిలో సమాన హక్కు కల్పిస్తూ రాష్ట్ర పరిధిలో ఒక చట్టాన్ని తెచ్చారు. ఇది మహిళల జీవితాలకు ఎన్.టి.ఆర్. ఇచ్చిన అత్యంత కీలకమైన భరోసా అని చెప్పవచ్చు. ఈ చట్టం ముఖ్య ఉద్దేశం మహిళలు వరకట్న వేధింపులకు బలవుతున్నారని, వరకట్న వేధింపులు లేకుండా చేయాలి అని. మహిళలకు ఆస్తిలో హక్కు కల్పిస్తే, మహిళలు ఆస్తిలో వాటా కలిగి ఉన్నప్పుడు వారి మీద వేధింపులు ఉండవు అన్నది ఈ చట్టం వెనుక ఉద్దేశం. నేషనల్ లా కమీషన్ దీన్ని ఒక మంచి చట్టం అని, దేశవ్యాప్తంగా అమలుచేయాలని కేంద్ర ప్రభుత్వానికి సిఫారసు చేసింది.

**2005లో నాటి ప్రభుత్వం అప్పటికే ఉన్న హిందూ వివాహ చట్టంలో కొన్ని సవరణలు తీసుకు వచ్చింది. దాని ఫలితమే తండ్రి ఆస్తిలో ఆడపిల్లలకూ సమాన హక్కు , సమాన వాటా కల్పిస్తూ 2005, సెప్టెంబర్ 9 నుండి అమలలోకి వచ్చిన చట్టం. ఈ చట్టం ప్రకారం మహిళలకు ఎవరికైనా సరే తన తండ్రి నుండి వచ్చే ఆస్తిని సమానంగా పొందే హక్కు ఉంది. ఆ కుటుంబంలో ఇద్దరు ముగ్గురు అన్నదమ్ములు ఉండి, అన్నదమ్ములే కాదు ఆడపిల్లలుంటే, ఆడపిల్లలకూ సమాన చాటా ఇవ్వాలని ఈ సవరణ చెబుతుంది.**

నిన్నటి సుప్రీంకోర్టు తీర్పు నేపథ్యం.

ఒకవేళ ఆ నాటికి తండ్రి మరణించి, ఆస్తి పంపకాలు జరిగిపోయి ఉంటే ఎలా? ఈ విషయంగా అనేక మీమాంసలు, కేసులు! పూలా దేవి ఈ విషయంగా సుప్రీంకోర్టు వరకు వెళ్లారు. పూలా దేవి ఆస్తిని క్లెయిమ్ చేసుకునే సమయానికి తండ్రి మరణంచి ఉన్నాడు. అప్పటి ద్వి సభ్య బెంచ్ తండ్రి చనిపోయాడు కాబట్టి ఈ చట్టం వర్తించదని, ఆస్తిలో పూలాదేవికి సమానవాటా రాదని తీర్పు ఇచ్చింది.

దీని మీదత్రిసభ్య ధర్మాసనం తీర్పునిచ్చింది. పూలా దేవినే కాకుండా ఆనేకమంది మహిళలు కోర్టను అశ్రయించిన నేపథ్యంలో, ఆ కేసులన్నింటినీ విచారణ జరిపి ఈ తీర్పును వెలువరించింది.

ఈ చట్టాన్ని తీసుకు వచ్చిన ఉద్దేశాన్ని దృష్టిలో పెట్టుకుని తీర్పునివ్వటం జరిగింది.

1) 2005 సెప్టెంబర్ 9కి తండ్రి మరణించినా, బ్రతికి ఉన్నా పంచని ఆస్తి ఏదయితే ఉందో, ఆ పంచని ఆస్తి మీద మహిళలకు తప్పక హక్కు ఉంటుంది. మహిళలు సమాన హక్కు , సమానవాటా పొందే హక్కు ఉంది అని ఈ రోజు క్లారిటీ ఇచ్చింది.

2) ఒక వేళ అప్పటికే పంపకాలు జరిగి ఉండి, అంటే 2004 డిసెంబర్ నాటికి పంపకాలు జరిగిపోయి ఉంటే దాని మీద క్లెయిమ్ చేయడానికి వీలులేదని చెప్పింది.

3) తండి మరణించినా, ఉన్నా, పంపకంకాని ఆస్తి మీద మహిళలకు క్లెయిమ్ చేసుకునే హక్కు ఖచ్చితంగా ఉందని జస్టిన్ అరుణ్ మిశ్రా నాయకత్వం వహించిన త్రిసభ్య ధర్మాసనం తీర్పు నిచ్చింది.

# ఫెయిర్ అండ్ లవ్లీ కాదు గ్లో అండ్ లవ్లీ



నలుపును చిన్న చూపు చూస్తు.. నల్లగా వున్నవారి పట్ల తక్కువ చేసి మాట్లాడడం మన సమాజంలో ఒక వైఖరిగా మారింది. చెప్పేవారికి వినేవారు లోకువా అన్నట్లు నల్లగా ఉంటే చాలు ఈ క్రీము వాడు, ఆ ఫౌడర్ వాడు అని ఉచిత సలహాలు పడేస్తుంటారు. అదే కోవలో ఫెయిర్ అండ్ లవ్లీ వంటి ప్రోడక్ట్ కూడా తెలుపునే సూచిస్తూ టీవీల్లో యాడ్స్ ఇస్తుంది. కాని ఇది నల్లగా వున్న వారి మనోభావాలకు దెబ్బతీసేలా ఉందని ఇప్పుడు కొత్త ట్రెండ్ సెట్‌చేస్తుంది.

తాజాగా తన ఫేమస్ ఫేస్ క్రీమ్ ఫెయిర్ అండ్ లవ్లీ పేరును మార్చేసింది. కొత్త పేరును కూడా ప్రకటించింది. ఇకపై కంపెనీ ప్రచార చిత్రాల్లోనూ కొత్త పేరు వినియోగదారులకు కనిపించనుంది.

ఫెయిర్ అండ్ లవ్లీ గురించి చాలా మందికి తెలుసు. దీని గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. ఇప్పుడు దీని గురించి ఎందుకంటే.. హెచ్‌యూఎల్ కంపెనీ తాజాగా ఫేయిర్ అండ్ లవ్లీ ఫేస్ క్రీమ్ పేరును మార్చేసింది. దీనికి గ్లో అండ్ లవ్లీ అని పేరు పెట్టింది. ఇకపై మీరు ఫెయిర్ అండ్ లవ్లీని గ్లో అండ్ లవ్లీ అని పిలవాల్సి ఉంటుంది.

బ్రాండ్ పేరును మరింత ముందుకు తీసుకెళ్లాలని కంపెనీ యోచిస్తోంది. అందుకే పెయిర్ అండ్ లవ్లీ పేరులో ఫెయిర్ పదాన్ని ఉపయోగించొద్దని నిర్ణయించుకుంది. రెగ్యులేటరీ ఆమోదం లభించిన తర్వాత కంపెనీ ఇప్పుడు కొత్త పేరును ప్రకటించింది.

ఫెయిర్ అండ్ లవ్లీ పేరు చాలా పాపులర్. మరి ఎందుకని కంపెనీ ఇలాంటి నిర్ణయం తీసుకుందని ఆలోచిస్తున్నారా? దీనికి ఒక కారణం ఉంది. **అమెరికాలో బ్లాక్ లైవ్స్ మేటర్ నిరసనలలో తెల్లరంగు ఆధిపత్యం మీద తీవ్ర వ్యతిరేకత వచ్చింది. అందులోనుండే ఈ ప్రకటనల మీద ధ్వజమెత్తారు. మన రాష్ట్రానికి చెందిన దావులూరి నీనా మరికొందరు మహిళలు సంతకాల సేకరణకు పూనుకున్నారు. ఫలితంగా జాన్సన్ అండ్ జాన్సన్ ఈ మేరకు నిర్ణయం తీసుకుంది.** దీంతో అమెరికాలో స్కిన్ లైటనింగ్ ప్రొడక్టుల అమ్మకాలను నిలిపివేస్తున్నట్లు ప్రకటించింది. ఇప్పుడు భారత్‌లోని స్కిన్ వైటనింగ్ బ్రాండ్లకు కూడా ఈ సెగ తాకినట్లు కనిపిస్తోంది. అందుకే ఇప్పుడు హెచ్‌యూఎల్ కూడా కొత్త పేరును ప్రకటించింది.

ఈ నేపథ్యంలో కంపెనీ ప్రచార చిత్రాల్లో కేవలం తెల్లగా ఉన్న వారు మాత్రమే కాక ఇకపై అన్ని రకాల రంగుల్లో ఉన్న మహిళలు వారి ప్రకటనల్లో కనిపిస్తారు. అమెరికాలో సాగుతున్న జాత్యాహంకార వ్యతిరేక పోరాటం మహిళల్లో చర్చనీయాంశం అవడం స్వాగతించదగినది.







# నివాళులు

పీడిత ప్రజల కష్టాలను తెలిపిన కవి ప్రజా ఉద్యమాలలో తుది శ్వాస వరకు పనిచేసిన విప్లవకారుడు, ప్రజాకవి వీధి నాటకాలు ప్రసిద్ధుడు కామ్రేడ్ వంగ పండు ప్రసాదరావుగారి మరణానికి జోహార్లు. సిపిఎం రాష్ట్ర కార్యదర్శి వర్గ సభ్యులు, మాజీ ఎమ్మెల్యే, గిరిజన నాయకులు సున్నం రాజయ్య, కర్నూలు జిల్లా సిపిఎం పార్టీ కార్యదర్శిగా, రాష్ట్ర కమిటీ సభ్యులుగా, ప్రస్తుతం పార్టీ రాష్ట్ర కంట్రోల్ కమిషన్ మెంబర్ గా పనిచేస్తున్న టి. షడ్రక్ కరోనాకు బలి అవ్వడం విచారకరం. సున్నం రాజయ్య గిరిజన ప్రజల కోసం కష్టనష్టాలను ఓర్చి సుదీర్ఘ కాలం అందుబాటులో ఉంటూ సేవలందించారు. పోలవరం ముంపు సమస్య, నిర్వాసితుల సమస్య ముంచుకొస్తున్న ఈ తరుణంలో వారి మరణం ఎంతో నష్టం కలుగుతుంది. కర్నూలు జిల్లా కష్టజీవుల, కార్మికుల హక్కుల కోసం పోరాడిన షడ్రక్ కూడా కరోనాకు బలికావడం బాధకరం. మార్కిస్ట్ పార్టీ రాష్ట్ర నాయకులుగా ఉంటూ మహిళా ఉద్యమానికి అండగా నిలిచారు. వారి మరణం మహిళలకు, అభ్యుదయ వాదులకు తీరని లోటు. ఐద్వా రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శి రమాదేవి వారి మృతికి నివాళులర్పించారు.

కె. శారద

# తెగిన బంధం



"**నీ**కు చెల్లెలు మొగుడే దిక్కు. నీకింక పెళ్లి సంబంధాలు రావు, నీకు నేనే గతి" అంటూ లక్ష్మిని అసభ్యంగా, ఎగాదిగా చూశాడు ఆమె చెల్లెలి భర్త.

సమాధానం ఇవ్వాలనిపించలేదు లక్ష్మికి. కంపరంగా చూసింది అతని వైపు. నలుగురు ఆడపిల్లలున్న మధ్యతరగతి కుటుంబంలో పెద్ద పిల్ల లక్ష్మి. బాగా చదివి, ఉద్యోగం చేస్తూ తన కాళ్లమీద తాను నిలబడాలని ఆమె కోరిక. చిన్న చిన్న కోరికలతో భర్తనో, తండ్రినో డబ్బులడగటం, వారివ్వనంటే ఆడవాళ్లు నిరాశ పడడం ఆమె చాలా సార్లు చూసింది. ఇదే ఆమెకు నచ్చదు. ఆమె రెండో చెల్లెలు ప్రేమించి పెళ్లి చేసుకుంది. పెద్ద చెల్లెలికి మంచి సంబంధం చూసి లక్ష్మే పెళ్లి చేసింది. లక్ష్మిని చూసుకోడానికి వచ్చిన ఓ పెళ్లి కొడుకు ఆమె ఆఖరు చెల్లెల్ని చేసుకుంటానని కబురు పంపాడు. ఆ సంబంధంతో ఆమె పెళ్లికూడా జరిగిపోయింది. తీరా ఆఖరి చెల్లెల్ని ఇష్టపడి పెళ్లి చేసుకున్న అతగాడు లక్ష్మితో అసభ్యంగా ప్రవర్తించడం మొదలు పెట్టాడు. అతడు పోలీసు ఉద్యోగి. అందరి మీద పెత్తనం చేయడం, అందరి సంసారాల్లో జోక్యం చేసుకోవడం అతడి నైజం.

చక్కగా చదువుకున్న లక్ష్మి డీఎస్సీ పరీక్షలకు సిద్ధమవుతోన్న సమయంలో, మాధవ్‌తో పెళ్లయింది. ఇద్దరూ డీఎస్సీ పరీక్ష రాసి, ఉపాధ్యాయులుగా ఎంపిక య్యారు. లక్ష్మికి ఎక్కువ మార్కులు రావడంతో కౌన్సెలింగ్‌కు ముందు పిలుపు వచ్చింది. తరువాత మాధవ్‌కు కౌన్సెలింగ్ జరిగింది. కానీ దూరంగా ఉండే ఊరిలో అతనిని నియమిస్తూ ఉత్తర్వులు ఇచ్చారు. అప్పటికే లక్ష్మి నెల తప్పడం వల్ల ఆ అవకాశాన్ని వదులుకున్నాడు. లక్ష్మి ఓ పాపకు జన్మనిచ్చింది. ఆమె వుద్యోగానికి వెళ్తే, పాప పనులన్నీ మాధవ్ చూసుకునేవాడు. కాలక్రమంలో వీరికి

> **తన ఆలోచన్లు అన్నీ మాధవ్ భర్త కాక ముందే అతనితో పంచుకున్నాను. నేను జీవితంలో ఆలస్యంగానైనా నాకో మంచి తోడు దొరికాడని, నా జీవితం ఇంక హాయిగా సాగుతుందనే భావనతో నా మనసులో బాధంతా అతనికి చెప్పాను. ఆర్థిక బాధలు అసలే ఉండవనుకున్నాను. ఉద్యోగం ఇద్దరిలో ఎవరు చేసినా కానీ పర్వాలేదు, తండ్రిగా పిల్లల్ని చూసుకుంటున్నాడని సంతోషించాను.**

మరో పాప కూడా పుట్టింది. ఆ ఇద్దరు పిల్లల్నీ చూసుకుంటూ మాధవ్ ఇంట్లోనే ఉంటున్నాడు.

అలా... అలా... గడుస్తుండగా ... నిర్థిష్టమయిన పనిలేని మాధవ్ బుర్రలో పురుషాధిక్యత తలెత్తింది. కొత్త ఆలోచనలు మొలకెత్తాయి. లక్ష్మిని అనుమానించటం, అవమానించటం మొదలు పెట్టాడు. లక్ష్మికి ఖాళీగా ఉండే అవకాశమే తక్కువ. వున్న కొద్ది సమయమయినా తన వారితో గడపాలను కుంటుంది. కానీ మాధవ్ వుండనిచ్చేవాడు కాదు. తనే తీసుకువెళ్లి వారిని చూపించి తిరిగి వెంటనే తీసుకువచ్చేవాడు. అంతటితో ఆగలేదు. నెమ్మదిగా ఆమె ఎవరెవరితో ఫోను మాట్లాడుతుందో? ఆమెతో ఎవరెవరు? మాట్లాడుతున్నారో సెల్‌ఫోను కాల్స్ డాటాను నిత్యం చెక్‌చేసే దాకా దిగజారాడు. తనకంటూ కొన్ని ఆశయాలూ, లక్ష్యాలు ఉన్న లక్ష్మి, భర్త తీరును భరించలేక పోతోంది. ఆమెకు ఓపిక నశించటంతో ఓ రోజు పిల్లలతో కలిసి ఆ నుంచి బయట పడింది.

అయినా మాధవ్ వేధింపులు ఆగ లేదు. విసిగిపోయిన లక్ష్మి అతడిపై కేసు పెట్టాలనుకుంది. అది తెలిసిన మాధవ్ ఐద్వా కుటుంబ సమస్యల పరిష్కార వేదికను వెతుక్కుంటూ వచ్చి భార్యపై తనే ముందుగా ఫిర్యాదు చేశాడు. భార్య తనను చులకనగా చూస్తున్నదనీ, ఉద్యోగం లేకపోవడం వల్ల తనని గౌరవించడం లేదనీ ఆరోపించాడు. తాను పిల్లల కోసమే బతుకుతున్నాననీ, వారిని విడిచి వుండలేననీ చెప్పుకొచ్చాడు. ఐద్వా పెద్దలు ఇదంతా విని, తమను కలుసుకోవల్సిందిగా లక్ష్మికి లేఖ పంపించారు. తరువాత వారం లక్ష్మి ఐద్వా ఆదాలత్‌కు వచ్చింది. "నా ఆలోచనలను పెళ్లికి ముందే మాధవ్‌తో పంచుకున్నాను. జీవితంలో ఆలస్యంగానైనా నాకో తోడు దొరికాడనీ, జీవితం ఇంక

హాయిగా సాగుతుందనే భావనతో, మనసులో బాధనంతా అతనికి చెప్పాను. ఆర్థిక బాధలు అసలే వుండవనుకున్నాను. ఇద్దరిలో ఎవరు ఉద్యోగం చేసినా పర్వాలేదనుకున్నాను. తండ్రిగా మాధవ్ పిల్లల్ని చూసుకుంటు న్నాడనీ సంతోషించాను. కానీ పిల్లలు పెద్దవాళ్లై, వారి పనులు వారు చేసుకుని స్కూలుకి వెళుతున్నారు. భార్యాభర్తలు ఇద్దరూ ఉద్యోగస్తులుగా ఎంతో మంది పిల్లల్ని పెంచుకోవడం లేదా? మాధవ్ ఎన్నాళ్లు ఇంట్లోనే వుంటాడు? ఇరుగు పొరుగు, స్నేహితులు అడుగుతుంటే నేనేమి సమాధానం చెప్పాలి? నా పుట్టింటి వారితో కలవనివ్వడు. చెల్లెలి భర్త నాతో అసభ్యంగా ప్రవర్తించాడనీ, ఇప్పుడు ఇతను కూడా నా చెల్లెళ్లతో అసభ్యంగా ప్రవర్తించాడు. ఇది ఎంత వరకు సబబు? ఇవన్నీ ఒకెత్తు, అతని అనుమానపు జబ్బు ఒకెత్తు. నేను అతనితో కలిసుండలేను" తేల్చి చెప్పింది లక్ష్మి.

అంతా విని ఐద్వా పెద్దలు మాధవ్‌తో "తనకన్ని విధాలా నీవు అండగా వుంటావనీ, తన సమస్యలన్నీ నీతో పంచుకుంటే, నీవేమో అనుమానంతో అమానుషంగా సంకెళ్లు వేసి మనసు విరి చేశావు. ఈ విషయాలన్నీ మొదట్లోనే పరిష్కారం చేసుకుంటే సరిపోయేది. ముందు వుద్యోగం చూసుకో. నీలో లోపాలన్నీ సరిదిద్దుకో. మీరిద్దరూ కలిసే పనిని అప్పుడు ఆలోచిద్దాం" అని చెప్పి పంపారు.



> ఇద్దరూ కలిసి వివాహ బంధాన్ని తెగే దాకా లాగారు. వీరి మధ్య పసిబిడ్డలు నలిగిపోయారు. ఏ తప్పుచేయని మనుషులు ఎక్కడా ఉండరు. కానీ ఆ తప్పు దిద్దుకునే అవకాశం ఉంది అనుకుంటే ఆ అవకాశాన్ని అందుకొని తప్పు దిద్దుకుంటే చాలా కుటుంబాలు ఇలా విడాకుల వరకూ రావు.

కొన్నాళ్ల తరువాత మాధవ్ మళ్లీ వచ్చాడు. మేడమ్ మీరు చెప్పినట్లే నేను చిన్న వుద్యోగం చేసుకుంటున్నాను. తల్లీదండ్రీ నేనై పిల్లల్ని పెంచాను. వాళ్లను చూడాలని వుంది. దయచేసి వాళ్లను చూపించేలా ఏదయిన చేయండి ప్లీజ్ అని వేడుకున్నాడు. ఐద్వా పెద్దలు లక్ష్మికి ఫోను చేశారు. ఆమె వినలేదు. స్థానిక ఐద్వా బాధ్యులను ఆమె ఇంటికి పంపించి నచ్చజెప్పే ప్రయత్నం చేశారు. కానీ ఆమె, తన నిర్ణయాన్ని మార్చుకోనని తెగేసి చెప్పింది. అంతే కాదు. ఆమె ఆ ఇల్లు కూడా మారిపోయింది. చేసేది లేక ఐద్వా బాధ్యులు మాధవ్‌ను నీ సమస్యకు పరిష్కారం కోర్టులోనే తేలుతుందని సూచించారు. ఇద్దరూ వివాహ బంధాన్ని తెగేదాకా లాగారు. తల్లిదండ్రుల మొండి పట్టుదలలతో మధ్య పసిబిడ్డలు నలిగిపోతున్నారు. ఏ తప్పూ చేయని మనుషులు వుండరు. కానీ ఆ తప్పు దిద్దుకునే అవకాశం ఉంది. ఆ అవకాశాన్ని అందుకొని తప్పు దిద్దుకుంటే చాలా కుటుంబాలు ఇలా విడాకుల వరకూ రావు. ఒక ముచ్చటైన జంటను కలపలేక పోయామే అని ఐద్వా పెద్దలు బాధపడ్డారు.

---

# సామాజిక కార్యకర్త ఇలినా సేన్ మృతి



ఛత్తీస్‌గఢ్ ప్రముఖ సామాజిక కార్యకర్త, రచయిత్రి ఇలినా సేన్ (69) కన్ను మూశారు. కొంతకాలంగా క్యాన్సర్‌తో బాధపడుతున్న ఆమె 8-20 తుదిశ్వాస విడిచారు. ఆమె హక్కుల ప్రచారకర్త, డాక్టర్ బినాయక్ సేన్ భార్య. ఆమె మృతికి అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) తీవ్ర విచారం వ్యక్తం చేసింది. కుటుంబ సభ్యులకు ప్రగాఢ సానుభూతిని తెలియ జేసింది. ఛత్తీస్‌గఢ్‌లో గనుల కార్పొరేటీకరణకు వ్యతిరేకంగా కార్మికుల తరపున పోరాడారు. గిరిజన హక్కుల కోసం కూడా అలు పెరుగని పోరుసల్పారు. రచయిత్రిగా 'ఇన్‌సైడ్ ఛత్తీస్‌గఢ్: ఎ పొలిటికల్ మిమైర్, సుఖ్వాసిన్ : ద మైగ్రెంట్ విమన్ ఆఫ్ ఛత్తీస్‌గఢ్' వంటి పుస్తకాలను రచించారు. సల్వా జుడుం తీవ్రవాద శక్తులకు వ్యతిరేకంగా భర్తతో కలిసి గళాన్ని వినిపించారు. కోయకమాండ్ల పేరుతో పౌర నిఘా బృందాన్ని ఏర్పాటు చేశారు. భర్త ఆధ్వర్యంలో నడుస్తున్న రూపాంతర్ ఎన్‌జిఒను అభివృద్ధి చేసి... మారుమూల ప్రాంతాల్లో ప్రజారోగ్యంపై ఉద్యమాన్ని చేపట్టారు. కార్మిక వర్గ ఆరోగ్య సంరక్షణ హక్కుల కోసం తీవ్రంగా పోరాడారు. మహారాష్ట్రలోని అంతర్జాతీయ హిందీ యూనివర్శిటీలో విద్యాబోధన చేశారు. 2007లో అక్రమ కేసులు బనాయించి అరెస్టు చేసిన భర్తను విడిపించేందుకు న్యాయ పోరాటానికి దిగారు. అదేవిధంగా ఆదివాసి యువకులను అన్యాయంగా అరెస్టు చేయడాన్ని వ్యతిరేకిస్తూ ప్రచారం చేపట్టారు.

# కరోనాపై శైలజా టీచర్ విజయకేతనం

**వ్యూహాన్‌లో ఉండగానే కేరళలో మొదలైన వ్యూహం**





**వ్యూహాన్** అంటే ఎనిమిది నెలల క్రితం వరకూ పెద్దగా ఎవరికీ తెలియదు కానీ కరోనా వైరస్ వ్యాప్తి కట్టడితో అందరికీ తెలిసింది. వ్యూహాన్‌లో కరోనా మహమ్మారి విజృంభిస్తుందని, దాని మూలంగా ఎంతో మంది ప్రాణాలు కోల్పోతున్నారని వార్తలు వెల్లువెత్తడంతో ఆమె తన ఆలోచనలను ఆచరణలో పెట్టారు. ప్రపంచం మొత్తం ఓ కుగ్రామంగా మారి విదేశీ దిగుమతులకు తలుపులు తెరిచి ఉంచిన మన దేశానికి కరోనా మహమ్మారి రావటానికి ఎంతో కాలం పట్టదని ఆమె పసిగట్టారు. కోవిడ్ -19 మహ్మారి ప్రపంచ దేశాలను అల్లాడిస్తున్న ఈ తరుణంలో కరోనాను కట్టడి చేసి కేరళ వైపు దేశమంతా చూసేలా చేశారు. ఐక్యరాజ్య సమితిలో అడుగు పెట్టి కరోనా అదుపు చేయడానికి ఆమె తీసుకున్న ఆచరణపై ప్రసంగించడానికి పిలుపును సంపాదించారు. ఆమె ఎవరో కాదు కేరళ ఆరోగ్యశాఖ మంత్రి డా॥ కె. కె. శైలజ అందరికి తెలిసిన శైలజ టీచర్. ప్రపంచ వ్యాపిత గుర్తింపును తెచ్చుకున్నారు. శైలజ టీచర్ కె.కె.కుందన్ శాంత దంపతులకు 20 నవంబర్ 1956లో జన్మించారు. కమ్యూనిస్టు నాయకురాలుగా ఉన్న నాయనమ్మ కె. శాంత ప్రభావం శైలజపై పడి ఆమెను కమ్యూనిస్టు విధానాలపై మక్కువ పెంచుకునేలా చేసింది. నాయనమ్మ ఓ నర్సుగా ప్రజలకు చేసే సేవలను చూస్తూ పెరగడంతో శైలజకు సేవాభావం ఎక్కువగానే ఉండేది.

మట్టనూర్‌లోని ఎన్.ఎస్.ఎస్ కళాశాలలో భౌతిక, రసాయన శాస్త్రంలో బిఎస్సీ పూర్తి చేశారు. కాలేజీలో చదువుతున్నప్పుడు ఎస్ఎఫ్ఐ(భారత విద్యార్థి ఫెడరేషన్)లో చురుగ్గా పని చేశారు. విద్యార్థి సమస్యలపై

> "పటిష్టమైన ఆరోగ్య వ్యవస్థతోనే సాధ్యం కోవిడ్ చైనాలో మొదలైందన్నప్పుడే మేం జాగ్రత్తలు తీసుకోవడం మొదలుపెట్టాం. గతంలో నిఫా వైరస్‌ను ఎదుర్కొన్న అనుభవాలు మాకు బాగా ఉపయోగపడ్డాయి. యునైటెడ్ నేషన్ ఆర్గనైజేషన్ 2008లో 'వన్ వరల్డ్ వన్ హెల్త్' (ఒకే ప్రపంచం ఒకే ఆరోగ్యం) అనే నినాదాన్ని ఇచ్చింది. ఆ నినాదాన్ని మేము మా రాష్ట్రంలో సమర్థవంతంగా అమలు చేయడానికి కృషి చేయడం వల్ల మేము కోవిడ్ వ్యాప్తి నుండి బయటపడగలిగాము."

రాజీలేని పోరాటం చేశారు. అదే సమయంలో డీవైఎఫ్ఐలో రాష్ట్ర కమిటి సభ్యురాలిగా కూడా ఉన్నారు. డిగ్రీ తర్వాత 1980లో బీఎడ్ పూర్తి చేశారు. ఆ తర్వాత కన్నూరులోని శివపురం హైస్కూల్లో ఉపాధ్యాయురాలిగా చేరారు. ఉపాధ్యాయ సంఘంలోనూ తన వంతు పాత్ర పోషించారు. 17 సంవత్సరాలు ఉపాధ్యాయ వృత్తిలో వుండి ప్రత్యక్షంగా రాజకీయాల్లో పాలుపంచుకునేందుకు, ప్రజలకు సేవచేయాలనే ఉద్దేశంతో ఉద్యోగానికి స్వచ్ఛంద విరమణ చేసి పూర్తికాలం కార్యకర్తగా సిపిఎం పార్టీలోకి వచ్చేశారు. ఐద్వా రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నో మహిళా పోరాటాలకు నాయకత్వం వహించారు.

తనతో పాటు పార్టీలో చురుగ్గా పని చేస్తున్న కె. భాస్కరన్‌ను 1981లో ప్రేమ వివాహం చేసుకున్నారు. ఈయన కూడా ఉపాధ్యాయుడే. వీరికి ఇద్దరు కొడుకులు. లసిత్, శోబిత్. ఇద్దరూ ఇంజనీర్లే. శైలజకు పుస్తకాలు చదవడమంటే ఎంతో ఇష్టం. అలాగే కాస్త ఖాళీ సమయం దొరికితే చక్కని సంగీతాన్ని ఆస్వాదిస్తారు.

విద్యార్థి దశ నుండే ఎన్నో ఉద్యమాలకు నాయకత్వం వహించిన శైలజకు తన

ప్రాంతంలోనే కాక రాష్ట్రంలో కూడా విశేషమైన ప్రజాభిమానం వుంది. 1996 నుండి 2006 వరకు కూతుపరంబా నియోజకవర్గం నుండి మూడు సార్లు సిపిఐ(ఎం) తరపున ఎమ్మెల్యేగా గెలుపొందారు. ప్రస్తుతం కేరళ ఆరోగ్య, సాంఘిక సంక్షేమ శాఖ మంత్రిగా బాధ్యతలు చూస్తున్నారు. కేరళ క్యాబినెట్‌లో ఉన్న ఇద్దరు మహిళా మంత్రుల్లో ఈమె ఒకరు.

మంత్రిగా బాధ్యతలు తీసుకునే నాటికి ఆమెకు వైద్య రంగంపై పెద్దగా అవగాహన లేదు. సైన్సు టీచర్‌గా, వామపక్ష ఉద్యమాల్లో కార్యకర్తగా పని చేయడమే తనుకున్న అనుభవంగా చెప్తారు ఆమె. నిరంతర అధ్యయనం, శాస్త్రీయ భావజాలమే ఈ రంగం గురించి త్వరగా అర్థం చేసుకోవడానికి ఆమెకు ఉపయోగపడింది. కష్టకాలంలో ఎలా స్పందించాలి, ముందు జాగ్రత్తగా ఎలాంటి నిర్ణయాలు తీసుకోవాలి అనేవి ఆమె విద్యార్థి ఉద్యమం నాటి నుండే అలవర్చుకున్నారు. ఆ అనుభవంతోనే చైనాలోని వుహాన్‌లో కరోనా వైరస్ తలెత్తిందని తెలుసుకున్న వెంటనే అప్రమత్తమయ్యారు. అప్పటికే నిఫా వైరస్‌తో యుద్ధం చేసిన కేరళ రాష్ట్రం కరోనా వైరస్‌ను ఎదుర్కోడానికి ఎలాంటి చర్యలు చేపట్టాలో ఆలోచించడం మొదలుపెట్టింది. వూహాన్‌లో కేరళ విద్యార్థులు ఎక్కువ మందే ఉన్నారు. వారెవరికైనా వైరస్ సోకి ఇక్కడకి వస్తే వారి ద్వారా ఇతరులకు సోకే ప్రమాదం ఉంటుంది. అందుకే శైలజా టీచర్ కేరళ ఆరోగ్య కార్యదర్శితో ఈ విషయాన్ని చర్చించారు. మంత్రి వర్గం ఉమ్మడి నిర్ణయాలు తీసుకొని 14 జిల్లాలో కంట్రోల్ రూములు ఏర్పాటు చేయించారు. ప్రతి కంట్రోల్ రూమ్‌లో నిపుణుల బృందాలను నియమించారు. వైద్య సిబ్బంది మొత్తాన్ని రంగంలోకి దింపారు. ఫిబ్రవరిలోనే ఎయిర్ పోర్టులో అడుగుపెట్టిన ప్రతీ ఒక్కరికి స్క్రీనింగ్ టెస్టులు చేశారు. వచ్చిన ప్రతి ఒక్కరిని క్వారంటైన్‌కు పంపించారు. ఏమాత్రం లక్షణాలు కనిపించినా వారిని ఐసోలేషన్‌లో పెట్టి మెరుగైన చికిత్సను అందేలా చూశారు. రాష్ట్ర స్థాయి రాపిడ్ యాక్షన్ ఫోర్స్‌తో సమావేశమై మార్గదర్శకాలను సిద్ధం చేసుకున్నారు. దీని కోసం ప్లాన్ 'ఏ', 'బి', 'సి' లను రూపొందించుకున్నారు. వెంటనే వాటిని ఆచరణలో పెట్టారు. ప్లాన్ ఏ లో భాగంగా ప్రతి జిల్లాలో 4500 బెడ్‌లతో కోవిడ్ చికిత్సా కేంద్రాలను ఏర్పాటు చేశారు. ప్లాన్ బి లో వాటి సంఖ్యను పది వేలకు పెంచారు. ప్లాన్ సీలో హొటల్స్‌తో పాటు ఇతర భవనాలను క్వారంటైన్ కేంద్రాలుగా మార్చేశారు. ఇలా అన్ని రకాలుగా జాగ్రత్తలు తీసుకొని, పెను ముప్పు నుండి ప్రజలను కాపాడారు.

**యూఎన్‌ఓ ఉపన్యాస సారాంశం**

"పటిష్టమైన ఆరోగ్య వ్యవస్థతోనే కరోనాను ఎదుర్కోనడం సాధ్యం. కోవిడ్ చైనాలో మొదలైందనప్పుడే మేం జాగ్రత్తలు తీసుకోవడం మొదలుపెట్టాం. **గతంలో నిఫా వైరస్‌ను ఎదుర్కొన్న అనుభవాలు మాకు బాగా ఉపయోగపడ్డాయి. యునైటెడ్ నేషన్ ఆర్గనైజేజన్ 2008లో 'వన్ వరల్డ్ వన్ హెల్త్' (ఒకే ప్రపంచం ఒకే ఆరోగ్యం )అనే నినాదాన్ని ఇచ్చింది. ఆ నినాదాన్ని మేము మా రాష్ట్రంలో సమర్థవంతంగా అమలు చేయడానికి కృషి చేయడం వల్ల మేము కోవిడ్ వ్యాప్తి నుండి బయటపడగలిగాము.** దీనికోసం విజయన్ ఆధ్వర్యంలో మా ప్రభుత్వం ఎన్నో కీలకమైన నిర్ణయాలు తీసుకుంది. నిఫా వైరస్‌ను ఎదుర్కొనే సమయంలోనే మా బలాలు, బలహీనతలు అర్థం చేసుకున్నాం. ఆ సమయంలోనే రెండు వరదలు మా రాష్ట్రాన్ని ముంచేశాయి. వాటిని కూడా ఎదుర్కొన్నాం. వరదల సమయంలో ప్రజలకు వివిధ అంటురోగాలు వచ్చే అవకాశం ఎక్కువ. మా దగ్గర పటిష్టమైన ప్రజాఆరోగ్య వ్యవస్థ ఉండడం వల్ల ప్రజలను కాపాడు కోగలిగాం. లాక్‌డౌన్ సమయంలో ఎవ్వరూ ఆకలితో బాధపడకూడదని ఎన్నో ఏర్పాట్లు చేశాం. దీనికోసం కుడుంబశ్రీ సంఘాలు ఎన్నో సేవలు చేశాయి. రాష్ట్ర ప్రజలు కూడా మేం తీసుకున్న ప్రతి నిర్ణయాన్ని గౌరవించారు. సహాయ సహకారాలు అందించారు.

**నాలుగు ప్రణాళికలు**

ఇక కోవిడ్ విషయానికి వస్తే ప్రపంచ ఆరోగ్య సంస్థ ఎప్పుడైతే దీన్ని మహమ్మారి అని చెప్పిందో ఆ తర్వాత నుంచి మరిన్ని జాగ్రత్తలు తీసుకున్నాం. రాష్ట్రంలో మొదటి మూడు కేసులు నమోదు అయినవెంటనే మా దగ్గర ఉన్న ఆరోగ్య వ్యవస్థను ఉపయోగించుకొని మాకున్న గత అనుభవాల రీత్యా తగిన చర్యలు తీసుకున్నాం. వైరస్ ఎక్కువగా వ్యాప్తి చెందకుండా నాలుగు దశలను రూపొందించుకున్నాం. అవి...

మొదటిది: మాకున్న అధునాతల టెక్నాలజీని ఉపయోగించి రోగిని ట్రేస్ చేయడం, క్వారంటైన్ చేయడం, టెస్టులు చేయడం, ఐసోలేట్ చేయడం, చికిత్స ఇవ్వడం.

రెండోది: వైరస్ ఎక్కువ మందికి వ్యాప్తిచెందకుండా తగిన జాగ్రత్తలు తీసుకునే పనిపై దృష్టిపెట్టాం. మాకున్న సంఘాలు ముఖ్యంగా కుడుంబశ్రీ మాకెంతో ఉపయోగపడింది. 'బ్రేక్ ద చైన్' అనే నినాదాన్ని తీసుకున్నాం. ఈ నినాదాన్ని ప్రజల్లోకి విస్తృతంగా తీసుకెళ్ళాం.

మూడోది: ఈ మహమ్మారి వృద్ధులకు, గర్భిణీలకు, పిల్లలకు సోకుండా ఆపడం అనేది మా మూడో లక్ష్యంగా పెట్టుకుని చర్యలు తీసుకున్నాం.

నాల్గోది: వైరస్ వల్ల మరణాలు సంభవించకుండా తగిన జాగ్రత్తలు తీసుకున్నాం. దీని ఫలితంగా మా దగ్గర 0.6 శాతం మాత్రమే మరణాల రేటు ఉంది."

**లోపాలను ఉపేక్షించరు**

శైలజ ఎంత నెమ్మదిగా ఉంటారో అంత ముక్కుసూటిగా వ్యవహరించే వ్యక్తి. ప్రజల ఆరోగ్యం విషయంలో ఎక్కడ ఏ చిన్న పొరపాటు జరిగినా ఉపేక్షించరు. కరోనా సేవలను పరిశీలించేందుకు నిత్యం ప్రజలకు అందుబాటులో వున్నారు. ఆస్పత్రిలో రోగులను పలకరించటం చేసేవారు. ఒక ఆస్పత్రిలో కొన్ని లోపాలను గమనించి సిబ్బందిపై ఆగ్రహం వ్యక్తం చేశారు. అర్థరాత్రి అయినా ప్రజలకు సేవ చేయడంలో ఆమెది రాజీపడే మనస్తత్వం కాదు. కేరళలో ఆమెకు విశేషమైన అభిమానులు ఉన్నారు. అలాగే శైలజ ఆధ్వర్యంలో కేరళ ప్రభుత్వం కరోనాపై చేసిన పోరాటాన్ని అక్కడి దేశాభిమాని పత్రికా రిపోర్టర్ జెస్సీన 'వైరస్' పేరుతో ఓ పుస్తకాన్ని కూడా ప్రచురించింది.

**సామాజిక భద్రత ఉన్నప్పుడే**

మహారాష్ట్రలో కరోనా వైరస్ రోజురోజుకు విజృభిస్తుంది. మరణాల రేటు కూడా అత్యధికంగా ఉంది. ఇలాంటి పరిస్థితుల్లో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విలేకరి కేకే శైలజను ఓ ప్రశ్న అడిగారు. మీరే మహారాష్ట్ర ఆరోగ్యశాఖ మంత్రి అయితే ఇలాంటి పరిస్థితుల్లో వెంటనే ఎలాంటి చర్యలు తీసుకుంటారని. దానికి ఆమె స్పందిస్తూ "నేను ఆ రాష్ట్ర ఆరోగ్య శాఖ మంత్రిగా ఉంటే ఎలాంటి నిర్ణయం తీసుకుంటాను అనేది చెప్పడం కష్టం. ఎందుకంటే మా రాష్ట్రం వామపక్ష భావజాలంతో నడుస్తున్నది. మహారాష్ట్ర ఆరోగ్యశాఖ మంత్రి నాతో 14 నిమిషాల పాటు ఫోన్లో మాట్లాడారు. మేము మా రాష్ట్రంలో తీసుకుంటున్న జాగ్రత్తల గురించి ఎన్నో విషయాలు అడిగి తెలుసుకున్నారు. ఇక్కడ ఓ విషయం ఏమిటంటే మహారాష్ట్రలో ధారవీ అతిపెద్ద స్లమ్ ఏరియా. అలాగే ఢిల్లీలో కూడా ఇలాంటి ప్రాంతాలు ఉన్నాయి. అలాంటి చోట వైరస్ వ్యాప్తి చెందితే చాలా ప్రమాదం. దాన్ని నిర్మూలించడం చాలా కష్టం. మా దగ్గర ఇలాంటి స్లమ్ ఏరియాలు లేవు. వీటిని ఎదుర్కోవాలంటే ముందు నుండే ఓ ప్రణాళిక వుండాలి. అవి స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండి తీసుకోవల్సిన జాగ్రత్తలు. ప్రజలకు సామాజిక భద్రత కల్పించడం, భూమి పంచడం, ప్రజలు ఆర్థికంగా నిలదొక్కుకునే అవకాశాలు కల్పించడం లాంటివి చేయాలి. అప్పుడే వీటిని సమర్థవంతంగా ఎదుర్కోగలం. మా కేరళ రాష్ట్రంలో వీటన్నింటినీ వామపక్ష ప్రభుత్వ ఆధ్వర్యంలో స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండే అమలు చేశారు. కాబట్టి ఇప్పుడు ఇలాంటి విపత్కర పరిస్థితులు వచ్చినప్పుడు ధైర్యంగా ఎదుర్కొంటున్నాం. ప్రజలను కాపాడుకోగలుగుతున్నాం" అన్నారు ఆమె. ❖

---

# సూక్తులు చెప్పడానికే...




కరోనా కట్టడికి గోమూత్రం చాలని చెప్పిన కేంద్రహోంశాఖ మంత్రి అమిత్‌షా తనకి కరోనా వచ్చేసరికి కార్పొరేట్ హాస్పటల్స్‌కి వెళ్లి చికిత్స చేయించుకుంటున్నారు. గోమూత్రం తాగితే కరోనా వైరస్ పరిగెట్టి పారిపోతుందని ఉపన్యాసాలు దంచిన ఆయన తనవరకూ వచ్చేసరికి మాత్రం ఇవేమీ పనిచేయవని ప్రవేట్ హాస్పటల్‌లో జాయిన్ అయ్యారు. ఏదైనా ఎదుట వారికి చెప్పడానికే సూక్తులుంటాయని ఆయన మాటాల్లో అర్థమవుతోంది. అత్యుత్తమ గుర్తింపు పొందిన ఎయిమ్స్ వంటి ఆస్పత్రులకు సైతం వెళ్లడానికి ఇష్టపడలేదు మన కేంద్ర హోంశాఖ మంత్రి. ఢిల్లీ నుండి పొరుగు రాష్ట్రమైన హర్యానాకు ప్రయాణం చేసి గురుగావ్‌లోని వేదంత కార్పొరేట్ ఆస్పత్రిలో చేరారు. ఐదు నక్షత్రాల హోటల్ తరహా సౌకర్యాలను అందచేయడం ఈ ఆస్పత్రి ప్రత్యేకత. సర్కారు హాస్పటల్స్‌లో కరోనా రోగులకు అతి విలువైన వైద్యానికి తగ్గా ఏర్పాట్లు చేశామని వీడీయోకాన్ఫరెన్స్‌లో మూతి ముసుగేసుకొని చెప్పిన నాయకుల్లో కొంతమందికి కోవిడ్ వచ్చేసరికి నేడు కార్పొరేట్ హాస్పటల్స్ ముందు క్యూలు కడుతున్నారు. అమిత్ షా తో పాటు ఇతర నాయకులు ప్రభుత్వాసపత్రుల్లో ఏర్పాట్లు గణనీయంగా చేశామని చెబుతున్నారు. బెడ్లు ఖాళీ ఉన్నా పాలకులకు కోవిడ్ వచ్చేసరికి అవి పనికిరాకుండా పోయాయి. కానీ మళ్లీ తిరిగి ఎయిమ్స్ ఆసుపత్రికి వెళ్లి అమిత్ షా వైద్యం చేయించుకోవడం కొసమెరుపైంది.



తల్లి షీనాతో ఉన్నికుట్టన్. కన్నీరు తుడుచుకుంటున్న మేరీ అనిత

# నెల రోజుల అమ్మ

**కరోనా నమోదు చేసిన లీలల్లో ఇది ఒకటి**

స్త్రీ అమ్మగా మారడానికి రోజులు అక్కర్లేదు. ఒక్క నిమిషం చాలు. పసిబిడ్డ గుండెలకు తాకిన మరుక్షణమే ఏ స్త్రీ అయినా తల్లిలా మారిపోతుంది.

మేరీ అనిత కూడా అలాగే మారింది. కాని ఆమె పోషించాల్సిన పాత్ర నెలరోజులు మాత్రమే అనే వాస్తవం ఉద్వేగభరితమైనది. జూన్ 14, 2020. ఎర్నాకులంలోని చైల్డ్ వెల్ఫేర్ డిపార్ట్‌మెంట్‌కు ఒక ఫోన్ వచ్చింది. షినా అనే మహిళకు కోవిడ్ పాజిటివ్ వచ్చిందని, ఆమెకు ఆరు నెలల కుమారుడు ఉన్నాడని, ఆ పసివాడ్ని చూసుకోవడానికి మనిషి కావాలని. కాని అక్కడ ఎవరూ లేరు. చైల్డ్ వెల్ఫేర్ డిపార్ట్‌మెంట్‌తో కలిసి పనిచేస్తున్న డా॥ మేరీ అనితకు ఈ సంగతి తెలిసింది. ఆమె క్లినికల్ సైకాలిజిస్ట్. స్పెషల్ చిల్డ్రన్ కోసం ఒక కేంద్రం నడుపుతోందామె. "ఎవరూ లేరు. కాని నేను ఆ పసివాడికి తల్లినవుతాను" అంది మేరీ. కోవిడ్ వచ్చిన తల్లిదండ్రులు ఆ పసివాడి పేరు ఉన్నికుట్టన్. తల్లిదండ్రులు నర్సులుగా హర్యానా వెళ్లి ఉపాధి పొందుతున్నారు. అక్కడ మొదట తండ్రికి కరోనా వచ్చింది. అతడు అక్కడే క్వారంటైన్లోకి వెళ్లగా తల్లి బాబును తీసుకొని కేరళలోని సొంత ప్రాంతమైన ఎర్నాకులం వచ్చింది. వచ్చాక ఆమెకు కోవిడ్ పాజింట్ అని తేలింది. అదృష్టవశాత్తు పసివాడికి నెగిటివ్ వచ్చింది. తల్లి వైద్యానికి ఆస్పత్రిలో ఉంటే పసివాడ్ని ఎవరు చూసుకోవాలనే సమస్య వచ్చింది. షినా బంధువులు కాని ముసలి తల్లిదండ్రులు కాని సాయం చేసే స్థితిలో లేరు. ఆ సమయంలో మేరీ అనిత ముందుకు వచ్చింది. ఆమెకు ముగ్గురు పిల్లలు ఉన్నారు. భర్త అడ్వకేట్‌గా పనిచేస్తున్నాడు. వారిని సలహా అడిగితే వారంతా మనస్ఫూర్తిగా పసివాడికి సాయం చేయమన్నారు. పిల్లవాడికి ఏ క్షణమైనా కోవిడ్ వచ్చే అవకాశం ఉండటంతో మేరి అనిత వాడ్ని తీసుకొని పక్కనే ఉన్న ఒక ఖాళీ ఫ్లాట్‌లోకి మారి క్వారంటైన్లోకి వెళ్లింది. నెల రోజులుగా బాబుకు అమ్మలా మారి బాగోగులు చూసుకుంది. నెల రోజుల ఉన్ని కుట్టన్‌కు అమ్మపాలు అలవాటు. కాని మేరి అనిత మెల్లగా పోతపాలలోకి మార్చగలిగింది. మెల్లమెల్లగా పసివాడు మేరిలోనే తల్లిని చూసుకోసాగాడు. ఈ నెలరోజులు వారి మధ్య గట్టి బంధం ఏర్పడిపోయింది. తండ్రి హర్యానా నుంచి తిరిగి రాగా, తల్లి కోవిడ్ నుంచి బయటపడింది. దీంతో మేరి ఆ పసివాడ్ని సొంత తల్లిదండ్రులకు అధికారుల సమక్షంలో అప్పజెప్పింది. ఉన్నికుట్టన్ తల్లిని గుర్తుపట్టి మెల్లగా నవ్వాడు కాని పసివాడ్ని తిరిగి ఇస్తూ మేరి కంట నీరు పెట్టుకుంది. 'ఆమె దేవతలా నా బిడ్డను కాపాడింది' అని షినా అంది. మేరి ఉండే అపార్ట్‌మెంట్‌లోని వారంతా వచ్చి ఉన్నికుట్టన్‌కు ఘనంగా వీడ్కోలు పలికారు. అయితే తన ఇల్లు చేరుకున్నాక ఉన్ని కుట్టన్ మేరి కోసం ఏడుపు మొదలుపెట్టాడు. అది గమనించిన తల్లి షినా వెంటనే మేరికి కాల్‌చేసింది. 'ఒక సారి వీడియోకాల్ చేస్తాను. మాట్లాడండి' అని ప్రాధేయపడింది. మేరి అనిత ఆ విన్నపాన్ని మనించలేదు. 'వద్దు. మీ ప్రేమతో వాడిని నన్ను మరిపించండి' అని మెల్లగా ఫోన్ పెట్టేసింది. పాశం పెంచుకునే సందర్భాలు ఎంత సంతోషాన్ని ఇస్తాయో తుంచుకునే క్షణాలు అంత బాధను మిగులుస్తాయి.

**కరోనా టెస్టింగ్ కోసమో లేక ఏదన్నా సొంత రిజిస్ట్రేషన్ల కోసమో కాదు వాళ్ళు నుంచుంది.**

**కేరళలో ఆగస్టు 14న జరిగిన విమాన ప్రమాదంలో గాయపడిన వారికి రక్తదానం చెయ్యడానికి స్వచ్ఛందంగా ముందుకి వచ్చి అర్ధరాత్రి 1 గంటకి కూడా లైన్లో నుంచుని ఎదురుచూస్తున్నారు.**



# అణు దౌష్ట్యానికి సజీవ ఖండన 'సిల్క్‌వుడ్'

## బయోపిక్ (1983)



**సి**నిమాల్లో బయోపిక్కుల హోరు సాగుతోందిప్పుడు. ఆయన చాయ్ అమ్మాడనీ, గుజరాత్ అల్లర్లు చూసి నిజంగానే తల్లడిల్లాడనీ సినిమా వచ్చింది. సినిమా అయితే హిట్టు కాలేదు గానీ రెండోసారి కూడా అయన సిక్సర్ కొట్టాడు. సిక్సర్ అంటే గుర్తొచ్చింది – మన దర్శకులు సచిన్, ధోనీల గురించి సినిమాలు తీస్తే ఎక్కడో విదేశాల్లో వాళ్ళు మన గణిత మేధావి రామానుజన్ గురించి సినిమా తీశారు. హిరోషిమా, నాగసాకి ఘటనలు జరిగిన ఆగస్టు నెలలో నల్లమల యురేనియం మైనింగ్ రేడియేషన్ హడావిడిలో గుర్తొచ్చే బయోపిక్ 'సిల్క్ వుడ్'. నలభై అయిదేళ్ళ క్రితం, అమెరికా అణు వ్యతిరేక కార్యకర్త కరెన్ గే సిల్క్‌వుడ్ కారు ప్రమాదంలో మరణించింది. అది ప్రమాదం కాదనీ, "కెర్ మెక్‌గీ అణు సంస్థ" చేసిన హత్య అనీ చాలా మంది భావిస్తారు.

టెక్సాస్‌లోని పెట్రో కెమికల్ పరిశ్రమ కేంద్రమైన నేడర్‌ల్యాండ్‌లో సిల్క్‌వుడ్ పెరిగింది. వివాహబంధం తెగిపోగా తన ముగ్గురు పిల్లలనూ భర్త సంరక్షణలో ఉంచాల్సి వచ్చింది. ఆ తర్వాత పని కోసం ఓక్లహోమా నగరానికి వెళ్లింది. 1972 లో ఆమె కెర్ మెక్‌గీ మెటలోగ్రఫీ ప్రయోగశాలలో చేరింది.

కెర్ మెక్‌గీలో పరిస్థితులు సవ్యంగా లేవని తెలియడానికి ఆమెకు అట్టే సమయం పట్టలేదు. ఆరోగ్య నిబంధనల ఉల్లంఘన జరుగుతోంది. కార్మికులు అనునిత్యం ప్లుటోనియం కాలుష్యానికి గురౌతున్నారు. లోపభూయిష్ట శ్వాసకోశ పరికరాలు, డెస్క్ డ్రాయర్లలో నిల్వ చేసిన ప్లుటోనియం నమూనాలు, స్థానిక పాఠశాలల్లో ప్రదర్శించి చెప్పడానికి ప్లుటోనియం నమూనాలు బయటకు తీసుకువెళ్ళడాలు – అంతా గందరగోళంగా వుంది.

ప్లాంటులో ప్రతి షిఫ్టులోనూ 75 మంది కార్మికులు పనిచేస్తుంటారు. వారి కాలుష్యహరణం కోసం కేవలం రెండే ప్రత్యేక స్నానాల గదులున్నాయి. పని సమయంలో స్నానం కోసం ప్రత్యేక సమయం కేటాయింపు లేనందున చాలా మంది కార్మికులు స్నానం చేయకుండానే ఇళ్ళకు వెళ్ళిపోతుంటారు.

సినిమా సమీక్షలో అప్రస్తుతమనిపించినా ఇక్కడ ప్లుటోనియం గురించి కొన్ని వివరాలు చెప్పాలి. యురేనియంతో నడిచే అణుశక్తి కర్మాగారంలో తప్పనిసరి వుప వుత్పత్తిగా ప్లుటోనియం పుడుతుంది. యురేనియంతోనే కాక ప్లుటోనియంతో కూడా అణుబాంబులు తయారుచేస్తారు. కనుక 'అణ్వస్త్ర రాజ్యాలు' 'శాంతి కోసం అణుశక్తి' మంత్రాన్ని జపిస్తుంటాయి.

రేడియోధార్మిక పదార్థాలకు 'అర్ధాయువు' అనేది ఒకటుంటుంది. ఒక గ్రాము పదార్థం రేడియేషన్ వదుల్తూ వదుల్తూ అర గ్రాము పదార్థంగా మారడానికి పట్టే కాలాన్ని అర్ధాయువు అంటారు. ఒక రేడియోధార్మిక పదార్థం సంపూర్ణంగా నిష్క్రియం కావడానికి పది అర్ధాయువుల కాలం పడుతుంది. ఆ విధంగా చూస్తే ప్లుటోనియం అర్ధాయువు 24,400 సంవత్సరాలు. అనగా ఒకసారి తయారైన ప్లుటోనియం 2,44,000 సంవత్సరాల పాటు రేడియో ధార్మిక కిరణాలను వదుల్తూ జీవరాశి మనుగడకు నష్టం కలిగిస్తుంటుంది. అందుకే దీన్ని 'మనిషి చేతిలో తయారైన ఆధునిక భస్మాసురుడు' అని చెప్పొచ్చు. ఒక గ్రాము ప్లుటోనియం లోని పది లక్షల వంతుల్లో ఒక వంతును పీల్చితే చాలు ఆ మనిషికి కాన్సర్ ఖాయం. అంటే 200 గ్రాముల ప్లుటోనియంతో ప్రపంచ జనాభాను హతమార్చవచ్చన్న మాట! అణు రియాక్టర్ల పుణ్యమా అని నేడు టన్నుల కొద్దీ ప్లుటోనియం

ప్రపంచంలో పోగైవుంది.

ప్లాంట్లో ఉద్యోగం పొందిన కొద్ది నెలల్లోనే, కెర్ మెక్‌గీలో ఆయిల్, కెమికల్ అండ్ అటామిక్ వర్కర్స్ యూనియన్‌లో మొదటి మహిళా కమిటీ సభ్యురాలిగా ఎన్నికవుతుంది సిల్క్‌వుడ్. "పూర్వం బొగ్గు గనులలోకి వెళ్ళే కార్మికులు తమతో పాటు పంజరంలో ఒక కానరీ పక్షిని తీసుకెళ్ళేవారు. కార్బన్ మోనాక్సైడ్ గ్యాసు లీకయితే ఆ పక్షి చనిపోతుంది. ఆ ప్రమాద హెచ్చరికతో కార్మికులు గమనించి బయటపడేవారు. ఇది (అణుశక్తి) సరికొత్త పరిశ్రమ. ఇక్కడ కార్మికులే కానరీ పక్షులు" – అని ఒక కార్మిక నాయకుడు చెప్పిన మాట ఆమెలో చైతన్యం నింపుతుంది. కార్మికులు ఎదుర్కొంటున్న ప్రమాదాలపై అప్రమత్తమైన ఆమె ఆరోగ్యభద్రతా లోపాలను పట్టిచూపే ప్రమాణాలను సేకరించడం ప్రారంభిస్తుంది. అధిక నిరుద్యోగం వలనా, యూనియన్లో చేరే వారిపై కంపెనీ ఆగ్రహంతో చూడడం వలనా కార్మికులను తనవైపు తిప్పుకోవడం కష్టంగా వుంటుంది.

అటమిక్ ఎనర్జీ కమిషన్ మద్దతుతో తయారైన కెర్ మెక్‌గీ కంపెనీకి "గౌరవనీయమైన" సంస్థగా పేరుంది. అణు పరిశ్రమలో అవినీతి ప్రబలంగా వున్నందున నిశ్శబ్దంగా, అతి జాగ్రత్తగా పనిచేయాలని సిల్క్‌వుడ్‌ను హెచ్చరిస్తుంది కార్మిక సంఘం. ఒక అణుశక్తి సంపన్న రాజ్యంలో అణు పరిశ్రమ తన ప్రయోజనాలను కాపాడుకోవడానికి ఎంతకు తెగిస్తుందో ప్రపంచంలో ఆ సరికి ఎవరికీ తెలీదు.

అణుపరిశ్రమకు వ్యతిరేక సాక్ష్యాలను సేకరిస్తున్నప్పుడు, సిల్క్‌వుడ్ ఫోన్ బగ్ చేశారు. ఆమె కదలికలపై నిఘా వేశారు. అంతకంటే హేయంగా ఆమెను వుద్దేశ పూర్వకంగా ప్లుటోనియంతో కలుషితం చేశారు. ఎంతగా అంటే ఆమె అపార్ట్మెంట్ నుంచి తొలగించిన బట్టలనూ, వస్తువులను డ్రమ్ముల్లో ఉంచి సీలు వేయాల్సి వచ్చింది.

కొన్ని నెలల సాక్ష్యాల సేకరణ తరువాత సిల్క్‌వుడ్ ఈ కథను జనం ముందుకు తీసుకుపోవాలని 'న్యూయార్క్ టైమ్స్' జర్నలిస్టుతో పరిచయం చేసుకుంటుంది. ఆ రోజు నవంబర్ 17, 1974 రాత్రి. యూనియన్ సమావేశం






తర్వాత తను సేకరించిన సాక్ష్యాలను జర్నలిస్టుకు అప్పగించడానికి కారులో బయలుదేరింది. అదే ఆమె ఆఖరు ప్రయాణమైంది.

హైవేకి పద్నాలుగు కిలోమీటర్ల దూరంలో ఆమె కారు రహదారిని వదిలి కాంక్రీట్ కల్వర్టును ఢీకొట్టింది. అంత నిర్జన ప్రాంతంలో అనుభవజ్ఞురాలైన డ్రైవర్ అలా ఎందుకు చేస్తుందో ఎవరికీ అర్థం కాలేదు. ఆమె వద్ద వున్న డాకుమెంట్లు మాయమయ్యాయి. ఆమె కుటుంబం చెప్పిన ప్రకారం, మరణానికి ముందు చాలా బెదిరింపు ఫోన్ కాల్స్ వచ్చాయి. కెర్ మెక్‌గీ (ప్రభుత్వ ఏజెంట్ల మద్దతుతో) సిల్క్‌వుడ్‌ను హత్య చేసినట్లు చాలా మంది సానుభూతిపరులు అనుమానించారు. కాని ఎటువంటి ఆధారాలూ చూపలేక పోయారు. అయితే, ప్లాంట్ వద్ద ప్లుటోనియంతో ఆమెను కలుషితం చేసినందుకు కెర్ మెక్‌గీపై సివిల్ దావా వేసి కోర్టు యుద్ధం తర్వాత ఔట్ ఆఫ్ ది కోర్ట్ సెటిల్మెంటుతో 1.3 మిలియన్ అమెరికన్ డాలర్ల జరీమానాను గెలిచారు ఆమె సన్నిహితులు. ఈ రకమైన కేసు కోసం ఇప్పటివరకూ ఇచ్చిన అతిపెద్ద మొత్తం ఇదే. కెర్ మెక్‌గీ తన అణు ఇంధన కర్మాగారాన్ని 1975 లో మూసివేసింది.

రిచర్డ్ ఎల్. రాష్కే పుస్తకం 'ది కిల్లింగ్ ఆఫ్ కరెన్ సిల్క్‌వుడ్' (2000) ప్రకారం, సిల్క్‌వుడ్ మరణం, కెర్–మెక్‌గీ కార్యకలాపాలపై దర్యాప్తు చేస్తున్న అధికారులు కూడా హత్యకు సంబంధించిన బెదిరింపులు ఎదుర్కొన్నారు. పరిశోధకులలో ఒకడు చాలా రహస్యంగా అదృశ్యమయ్యాడు. ప్లాంట్‌లో జరిగిన సంఘటనల గురించి కెర్–మెక్‌గీ కార్పొరేషన్‌కు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడానికి వచ్చిన సాక్షుల్లో ఒకరు విచిత్రంగా ఆత్మహత్య చేసుకున్నారు.

కేవలం 28 సంవత్సరాల వయసులో సిల్క్‌వుడ్ మరణం 'పోలీసు, అణు రాజ్య' దురాగతానికి నిదర్శనంగా నిలిచింది. ప్రపంచమంతా అణుశక్తి వ్యతిరేక పోరాటాలకు ప్రేరణగా 'విజిల్‌బ్లోయర్' కరెన్ సిల్క్‌వుడ్‌ను గుర్తుంచుకుంటారు. లాభాలు సంపాదించి పెట్టే కార్మికుల, ప్రజల భద్రతకు, పర్యావరణ పరిరక్షణకూ పెనుముప్పుగా మారినపుడు దానికి వ్యతిరేక పోరాటం తప్పదని సిల్క్ వుడ్ త్యాగం వృథా పోదని ప్రపంచ అణువ్యతిరేక

పోరాటాలు రుజువు చేశాయి.

మెరిల్ స్ట్రీప్ కొద్దిపాటి మేకప్‌తో నిజ జీవిత సిల్క్ వుడ్ పోలికను సంతరించుకోవడమే కాక, నిర్లక్ష్యంగా ఉంటూ, తను నమ్మిన ఆదర్శం కోసం ఏమైనా చేయగల వుక్కు మహిళ వ్యక్తిత్వంతో చాలా హుందాగా నటించింది. వ్యాపారపరంగా విజయవంతమవడమే కాక, 56వ అకాడమీ అవార్డులలో ఈ సినిమా మొత్తం ఐదు నామినేషన్లను అందుకుంది. వీటిలో వుత్తమ నటిగా స్ట్రీప్, ఉత్తమ సహాయ నటిగా చెర్, ఉత్తమ



దర్శకుడిగా మైక్ నికోలస్ వున్నారు. మెరిల్ స్ట్రీప్ ఉత్తమ నటిగా కాన్సాస్ ఫిలిం క్రిటిక్స్ అవార్డు అందుకోగా, సిల్క్‌వుడ్ స్నేహితురాలి పాత్రలో ఉత్తమ సహాయ నటిగా చెర్ గోల్డెన్ గ్లోబ్ గెలుచుకుంది. 'నాయకుడు' సినిమాలో 'నా చిట్టి తండ్రీ నిన్నెవరు కొట్టారు' పాట చాలా మందికి గుర్తుండే వుంటుంది. ఈ సినిమా ఆఖర్లో వచ్చే పాటను ఓసారి ప్రత్యేకంగా గమనించండి.

# కోర్టులూ పురుషుల పక్షపాతమా..?

కర్ణాటక ఉన్నత న్యాయస్థాన న్యాయమూర్తి కృష్ణదీక్షిత్ ఒక అత్యాచార నిందితుడికి బెయిలు మంజూరు చేసే సమయంలో వివాదాస్పద వ్యాఖ్యలు చేశారు. బాధితురాలు చెప్పేది నమ్మశక్యంగా లేదని వ్యాఖ్యానించారు. కార్యాలయానికి రాత్రి 11 గంటలకు ఎందుకు వెళ్లాలి? అత్యాచార నిందితుడితో కలిసి మద్యం సేవించవలసిన అవసరమేముంది? తెల్లవారే వరకూ తనతో కలిసి ఉండేందుకు ఆమె ఎందుకు అనుమతించింది? అంటూ ప్రశ్నలు వేశారు. అత్యాచారానికి గురయ్యాక అలసిపోయి నిద్రలోకి జారుకున్నానని బాధితురాలు చెప్పినప్పుడు ఆయన "ఇది భారతీయ మహిళ తీరు"లా లేదన్నాడు. అత్యాచారం జరిగితే భారతీయ మహిళ అలా వ్యవహరించదని ఆయన పేర్కొన్నారు. చివరకు ఆమె ప్రవర్తనను సందేహించేలా కోర్టు ఆదేశంలో జడ్జి వ్యాఖ్యలు చేయడం వల్ల పెద్ద దూమారం చెలరేగింది. సామాజిక ఉద్యమ కారులు నిరసనలు వ్యక్తం చేయడం వల్ల కోర్టు ఆదేశంతో ఆయన వ్యాఖ్యలను తొలగించారు. ఈ తీర్పుపై నిరసన వ్యక్తం చేస్తూ ఢిల్లీ సీనియర్ న్యాయవాది అపర్ణ భట్, భారత ప్రధాన న్యాయమూర్తితో పాటు సుప్రీమ్ కోర్టులోని ముగ్గురు మహిళా న్యాయమూర్తులకు బహిరంగ లేఖ రాశారు. **అత్యాచారం జరిగిన తరువాత ఎలా నడుచుకోవాలో చట్టంలో ఏమైనా విధానం వుందా..! అత్యాచార అనంతరం అత్యున్నత ప్రమాణాలు పాటించడానికి భారత మహిళలు ఏమైనా ప్రత్యేకమైనవారా..!** అంటూ ఈ విషయంపై కలగచేసు కోవాలని సర్వోన్నత న్యాయ స్థానాన్ని ఆమె కోరారు. ఎందుకంటే ఇది అత్యంత దారుణమైన మహిళా వ్యతిరేక ధోరణి. దీనిని ఖండించకపోతే, మనం మద్దతు పలికినట్లేనని వ్యాఖ్యానించారు. న్యాయ మూర్తి ఉపయోగించిన భాష కూడా అసభ్యంగా ఉందన్నారు. "రావిష్డ్" ఇది కాలం చెల్లిన పదం. హింసపై మహిళల పోరాటంలో తీవ్రతను ఇది తక్కువ చేసి చూపిస్తుంది. అంతే కాదు ఈ తీర్పు తీవ్ర అసంతృప్తికి గురిచేసిందని జస్టిస్ దీక్షిత్‌కు పౌరహక్కుల కార్యకర్తలు, రచయితలు, నటులు, గాయకులు బహిరంగ లేఖలు రాశారు. మహిళలపై లైంగిక హింస, అత్యాచారం వారి తప్పులవల్లే జరుగుతాయనే వాదనకు మద్దతు పలికేలా ఉన్నాయనేది పాత్రికేయుడు భూషణ్ అభిప్రాయం. నిజానికి అత్యాచారాలు



చాలా వరకూ పోలీసుల దృష్టికి రావని మహిళా హక్కుల ఉద్యమకారులు చెబుతున్నారు. లైంగిక హింసకూ, వివక్షకూ దగ్గరి సంబంధం ఉంది. ఒక బాధితురాలు సాక్ష్యం చెప్పడానికి వెళితే కోర్టు గదిలో ఉండే చాలా మంది నమ్మరు. కోర్టులో న్యాయమూర్తుల వ్యాఖ్యలు వారి భావనలు పురుషాధిక్యతను ప్రతిబింబించేలా ఉంటాయిగనుక చాలా కేసులు కోర్టు వరకూ రావడం లేదు. ఏదేమైనా న్యాయ మూర్తులు ఇలాంటి వ్యాఖ్యలు చేయకూడదని వార్విక్ విశ్వవిద్యాలయం విశ్రాంత ఆచార్యుడు ఉపేంద్ర భక్షి అభిప్రాయ పడ్డారు. మహిళల గౌరవానికి భంగం కలిగించే ఎలాంటి పనులూ చేయకూడదు. ఒక వర్గానికి వ్యతిరేకంగా న్యాయమూర్తి ఇలాంటి వ్యాఖ్యలు చేయరాదు" అని ఉపేంద్ర భక్షి పేర్కొన్నారు.

# ఉద్యమాల బాటలో




**మద్యంవద్దు-ఆరోగ్యం ముద్దు**

నెల్లూరు నగర ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో మద్యం అమ్మకాలను సమయాన్ని వ్యతిరేకిస్తూ కరోనా కట్టడి చేయడానికి సంపూర్ణ మద్యపాన నిషేధం విధించాలని సుందరయ్యనగర్, జాషువా నగర్, డైకాస్ రోడ్, వైఎస్సార్ నగర్, 24, 25, 30, 31 డివిజన్లలో ఐద్వా కమిటీ సభ్యులు సచివాలయంలోని పరిపాలన అధికారులకు వినతి పత్రం అందజేశారు. ఐద్వా నాయకులు విజయమ్మ, రమణమ్మ, జయమ్మ స్థానిక మహిళలు పాల్గొని సచివాలయం కార్యాలయం ఎదుట ధర్నా నిర్వహించారు.

కరోనా అల్లకల్లోలంలో కంటైన్‌మెంట్ జోన్లలో కూడా మద్యం అమ్మకాలను ప్రోత్సహిస్తూ వైన్ షాపులు తెరిచి వుంచడం, ప్రజల




పరిస్థితులను ప్రభుత్వం గుర్తించకపోవడం, తగినన్ని వైద్య సదుపాయాలు లేక అనేక మంది మరణిస్తున్న ప్రభుత్వం పట్టించుకోకపోవడంతో విజయవాడ ఐద్వా పశ్చిమ నగర కమిటీ నిరసన తెలిపారు. వైన్ షాపులు మూసివేయాలని, ప్రజలకు నిత్యావసర సరుకులు పంపిణీ చేయాలని, ఉపాధి కోల్పోయిన వారికి నెలకు రూ. 7,500 భృతి ఇచ్చి ఆదుకోవాలని వారు డిమాండ్ చేశారు.

తిరుపతి : లాక్‌డౌన్‌లో మద్యం షాపులను మూసేయాలని ఐద్వా డిమాండ్ చేసింది. ఈ సందర్భంగా జిల్లా అధ్యక్ష కార్యదర్శులు లక్ష్మి, సాయిలక్ష్మి మాట్లాడుతూ లాక్ డౌన్‌లో మద్యం షాపులు తెరవడం వల్ల కరోనా విపరీతంగా పెరుగుతుందని, తిరుపతిలో రోజు రోజుకు వందల సంఖ్యలో ఎక్కువవుతున్నాయని వారు పేర్కొన్నారు.

మద్యం షాపుల దగ్గర సామాజిక దూరం పాటించకపోవడం వల్ల ఇంట్లో వారికి కూడా కరోనా వ్యాప్తి చెందుతుందని వారు ఆందోళన చెందారు. కావున మద్యంషాపులను మూసేయాలని విజ్ఞప్తి చేశారు. ఇందులో నగర కార్యదర్శి జయంతి,నాయకులు ఆండాళ్,ఉష తదితరులు పాల్గొన్నారు.

విజయనగరం కణాపాక తారకరామాకాలనీలో 35వ వైన్స్ వద్ద




కారోనా కేసు పాజిటివ్‌గా తేలడంతో ఐద్వా ఆధ్వర్యంలో షాపుని మూసివేశారు. ఈ కార్యక్రమంలో జిల్లా అధ్యక్ష కార్యదర్శులు పి. రమణమ్మ, వి.లక్ష్మీ పాల్గొన్నారు.

జిల్లాలో రోజురోజుకు కారోనా పెరుగుతున్న నేపథ్యంలో వైన్స్ షాపులను తక్షణమే మూసివేయాలని ప్రభుత్వాన్ని ఐద్వా డిమాండ్ చేసింది.

మర్రిపాడు : కరోన కలవరంతో మండలప్రజలు భయాందోళనకు గురవుతుంటే చుట్టూ ప్రక్కల మండలాలకు



చెందిన మందుబాబులు మర్రిపాడు మద్యంషాప్‌కు వస్తుండడంతో మర్రిపాడుమద్యం దుకాణం వద్ద ధర్నా నిర్వహించారు. మూలి వెంగయ్య ,బత్తల రత్తయ్య ఐద్వాసంఘము మండల అధ్యక్షులు ప్రమీలమ్మ, శ్యామలమ్మ, మహిళలు పాల్గొన్నారు.

తూర్పుగోదావరి జిల్లా వేలేరుపాడు మండలం మద్దిగట్ల గ్రామంలో నాటు సారాను అమ్మకూడదని యువత నాటు సారా ఊటను వెతికి మరి ధ్వంసం చేసారు.

కాకినాడ : కరోనా వ్యాప్తికి నిలయాలుగా ఉన్న మద్యంషాపులను తక్షణమే మూసివేయాలని (ఐద్వా) జిల్లా కమిటీ డిమాండ్ చేసింది. ఈమేరకు ఐద్వా జిల్లా అధ్యక్ష, కార్యదర్శులు G.భవానీ, CH.రమణి ఒక ప్రకటన విడుదల చేస్తూ జిల్లాలో కరోనా పాజిటివ్ కేసులు విపరీతంగా పెరిగి పోతుంటే, మద్యం షాపుల వద్ద మందుబాబులు కిలోమీటర్ల మేర క్యూలు కడుతూ బాధ్యతా రహితంగా వ్యవహరిస్తున్నారన్నారు. ఇంత దారుణంగా పరిస్థితి ఉండి కరోనా వ్యాప్తి చేస్తుంటే ప్రభుత్వం, అధికారులు ఎందుకు పట్టించుకోవడంలేదని ప్రశ్నించారు. ఎన్ని టెస్టులు చేసినా... వ్యాప్తిని నిరోధించకపోతే ఉపయోగం లేదన్నారు.

అన్ని విధాలుగా నష్టం కలుగజేస్తున్న మద్యం షాపులను పూర్తిగా మూసివేయాలని కోరుతున్నామని లేఖలో తెలిపారు.

**స్కీమ్ వర్కర్ల సమస్యలను పరిష్కరించాలి (ఐద్వా) డిమాండ్**




శ్రామిక మహిళా సంఘం పిలుపుమేరకు ప్రజలకు విశేష సేవలందిస్తున్న ఆశా, అంగన్వాడి, ఏ.ఎన్.ఎం, మధ్యాహ్న భోజనం, గ్రామ వాలంటీర్ల సమస్యలు పరిష్కరించాలని కోరుతూ విజయవాడ ప్రకాష్ నగర్ 268, 269 సచివాలయ అధికారులకు మెమోరాండం అందజేశారు. ఈ సందర్భంగా అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి డి. రమాదేవి మాట్లాడుతూ కరోనా విజృంభిస్తున్న ఈ పరిస్థితుల్లో ప్రాణాలు సైతం లెక్కచేయకుండా పని చేస్తున్న స్కీం వర్కర్లకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రక్షణ పరికరాలు ఇవ్వాలని కోరారు. అలాగే స్కీం వర్కర్లను పర్మినెంట్ చేయాలని, ఈ.ఎస్.ఐ, పీ.ఎఫ్ సౌకర్యం కల్పించాలని, పెండింగ్ వేతనాలు ఇవ్వాలని, కరోనా డ్యూటీలు చేస్తున్న వారందరికీ నెలకు పదివేల రూపాయలు చొప్పున అదనంగా ఇవ్వాలని కోరారు. ఈ కార్యక్రమంలో పశ్చిమ కృష్ణ జిల్లా ఐద్వా ప్రధానకార్యదర్శి కె. శ్రీదేవి, సెంట్రల్ సిటీ ఐద్వా కార్యదర్శి జి. ఝాన్సీ రాణి, నగర నాయకులు ఎస్. కె. దేవి కుమారి. ఎస్. విజయ, ఆశా వర్కర్ రాధా తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ప్రభుత్వ రంగ సంస్థలను పరిరక్షించాలని ప్రవేటీకరణను




వ్యతిరేకిస్తు సేవ్ఇండియా నినాదంతో కేంద్ర కార్మిక సంఘాలు ఆందోళనకు పిలుపునిచ్చారు. ఈ పోరాటానికి మద్దతుగా ఐద్వా, ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య ఐద్వా ఆధ్వర్యంలో విజయవాడ సింగ్‌నగర్, సితార సెంటర్‌లలో ధర్నా జరిపారు. పట్టణ ఉపాధి చట్టం చేయాలని, పారిశుధ్య కార్మికులకు, వాలంటీర్లకు జీవిత బీమా సౌకర్యం కల్పించాలని, రైల్వే, విద్యుత్ తదితర సంస్థల ప్రయివేటీకరణను రద్దు చేయాలని డిమాండ్ చేశారు.

రమాదేవి, దుర్గా భవాని, శ్రీదేవి ఘాన్సీ, దుర్గాంబ, పాలవల్లి ఆదిలక్ష్మి, సిఐటియు నాయకులు సుధాకర్, కమల, దుర్గారావ్ డివైఎస్ఐ నుండి నిజాముద్దీన్ ఎఫ్ తదితరులు సింగ్‌నగర్‌లో నిరసన తెలిపారు.



సిఐటియు ఆధ్వర్యంలో దేశవ్యాప్తంగా సహాయ నిరాకరణ శాసన, ఉల్లంఘన సందర్భంగా గుంతకల్ పట్టణం నందు 34 సచివాలయలా వద్ద, మున్సిపల్ ఆఫీస్ వద్ద CITU అనుబంధ సంఘాలు, అంగన్ వాడీ టీచర్లు, ఆయాలు,మున్సిపల్ పారిశుధ్య కార్మికులు, ప్రజలు, ERO బిల్ రీడింగ్ కార్మికులు, చిన్నవ్యాపారస్తులు, భవననిర్మాణ కార్మికులు, ఆశావర్కర్లు, CPM పార్టీ నాయకులు, ప్రజా సంఘాలు DYFI, KVPS, ఐద్వా, SFI,



తిరుపతి

ఆవాజ్, PPS, నాయకులు, కార్యకర్తలు, పెద్ద ఎత్తున పాల్గొని ఆందోళన చేశారు.

ఈ సందర్భంగా నెల్లూరు రూరల్ నందు కార్మిక, కర్షక, కౌలు రైతులు ఇచ్చిన పిలుపుమేరకు స్కీమ్ వర్కర్ల నిరసన కార్యక్రమంలో సుభాహన్ నగర్, పడారిపల్లి, రాజగోపాల్‌రెడ్డి నగర్ ప్రాంతాల్లో ఐద్వా కార్యకర్తలు పాల్గొన్నారు.

తిరుపతి ఆర్‌డివో కార్యాలయం వద్ద ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలకు నిరసనగా వివిధ ప్రజా సంఘాలతో కలిసి నిర్వహించిన నిరసన కార్యక్రమంలో ఐద్వా నగర కార్యకర్తలు పాల్గొన్నారు.



తెనాలి

తెనాలి, గుంటూరు, రేపల్లెలో ఐద్వా ఆధ్వర్యంలో నిర్వహించారు. ఆగస్టు పశ్చిమ గుంటూరు జిల్లా వినుకొండలో పదిమంది పాల్గొన్నారు రంజాన్ తిరుమల లక్ష్మి సైదాబీ నాసర్ బి పాల్గొన్నారు.

## ఆరోగ్యం



నర్సాపురం

నర్సాపురంలో ప్రభుత్వ ఆసుపత్రి సూపరింటెండెంట్‌కు పూర్ణ, ఇతర నాయకులు మెమోరాండం ఇచ్చారు.

నెల్లూరులో ఐద్వా కమిటీ సభ్యులు కరోనా డ్యూటీలు చేస్తున్న డాక్టర్లుకు నర్సులకు ఆరోగ్య కార్యకర్తలకు రక్షణ పరికరాలు అందించాలని భీమా సౌకర్యం కల్పించాలని ప్రెస్ మీట్ నిర్వహించారు. నగర అధ్యక్ష కార్యదర్శులు వై.పద్మ. షేక్. మస్తాన్ బి.సుబ్బమ్మ. రెహెనా పాల్గొన్నారు.



నెల్లూరు

సచివాలయంవద్ద నిరసన తెలియజేసి అధికారులకు వినతిపత్రం ఇవ్వడం జరిగింది.

**రైల్వే ప్రవేటీకరణను వ్యతిరేకస్తూ...**

తిరుపతి : రైల్వే ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా జరిగిన నిరసన కార్యక్రమానికి తిరుపతిలో ఐద్వా మద్దతు తెలియజేసింది.

విశాఖపట్నం : కసింకోట మండలంలో స్థానిక రైల్వే స్టేషన్ వద్ద సిఐటియూ ప్రజాసంఘాలు, ఐద్వా ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమంలో సిఐటియు జిల్లా నాయకుడు దాకారపు మాట్లాడుతూ కేంద్రంలో ఉన్న బిజెపి ప్రభుత్వ ప్రధాని మోడీ రైల్వే ప్రైవేటీకరణను విరమించుకోవాలని

కోరారు. ఈ కార్యక్రమంలో ఐద్వా జిల్లా అధ్యక్షురాలు వరలక్ష్మి శేషు నాగరాజు తదితరులు పాల్గొన్నారు




అనంతపురం, గుంతకల్లు, తాడిపత్రి నగరాల్లో ఐద్వా ఆధ్వర్యంలో వైద్య సేవలు మెరుగు పరచాలని, ప్రవేటు ఆస్పత్రులలో అధిక ఫీజుల వసూళ్లను నియంత్రించాలని నిరసనలు జరిపారు.

**స్వాతంత్ర్య దినోత్సవం - ప్రతిజ్ఞ**

తిరుపతిలో స్వాతంత్ర దినోత్సవం సందర్భంగా స్వతంత్ర సమరయోధుల పోరాట బలం, అమరుల త్యాగఫలం నేటి మన పాలకులు ధ్వంసం చేస్తున్నారని, దాని కాపాడుకోవాలనే రాజ్యాంగ పీఠికతో ఐద్వా కార్యకర్తలు ప్రతిజ్ఞ నిర్వహించారు.

విశాఖ శీలానగర్‌లో కాలనీ అసోసియేషన్, ఐద్వా ఆధ్వర్యంలో




జాతీయ పతాకావిష్కరణ చేశారు.

విశాఖపట్నం, విమాన్‌నగర్ ఐద్వా సభ్యులు ప్రభావతి ఆధ్వర్యంలో వివిఎన్ఆర్‌డబ్ల్యుఏ కమిటీ సభ్యులు అన్నపూర్ణ జెండా వందనం చేశారు.

నెల్లూరు రూరల్ 31 డివిజన్ వైఎస్సార్ నగర్ పరిధి డి వై ఎ ఫ్ ఐ, ఐద్వా స్థానిక కమిటీ ల ఆధ్వర్యంలో 74వ స్వతంత్ర దినోత్సవాన్ని పురస్కరించుకుని శానిటేజర్లు, మాస్కులు పంపిణీ చేయటం జరిగింది.

**ఇంటి పనివారికి ఆర్థిక సహాయం చేయాలని..**

స్నేహ ఇంటి పనివాళ్ల సంక్షేమ సంఘం ఆధ్వర్యంలో బొబ్బిలి లేబర్ ఆఫీస్ వద్ద ధర్నా నిర్వహించారు. లాక్ డౌన్ కాలానికి రూ. 10 వేల ఆర్థిక సహాయం ఇవ్వాలని, కార్మికులుగా గుర్తింపు కార్డులు అందించాలని, ఇంటి పని కార్మికులలో ఒంటరి మహిళలకు, వితంతువులకు పెన్షన్‌లు, ఇళ్ల స్థలాలు ఇవ్వాలని,




ఈ ఎస్ ఐ, పీఎఫ్ సౌకర్యం కల్పించాలని, వీరి సంక్షేమానికి బోర్డు ఏర్పాటు చేయాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో సి ఐ టి యు నాయకులూ, మహిళా సంఘం నాయకులూ పాల్గొన్నారు.

సర్వే చేసి ఎమ్మార్వోకి, ఏఎల్‌వోకి సమస్యలతో కూడిన వినతి పత్రం అందజేశారు.

పాత గుంటూరు శివాలయం ప్రక్క వీధిలో ఇళ్లలో పనిచేసే వారికి రాష్ట్ర ప్రభుత్వం లాక్ డౌన్ కాలంలో పదివేల రూపాయల సాయం అందించాలని నిరసన కార్యక్రమంలో అరుణ మాట్లాడారు.

కాకినాడలో ఐద్వా ఎడ్యుకేషన్ విభాగం ద్వారా కోవిడ్ వారియర్స్‌కి ఫేస్‌షీల్డ్‌లు, మాస్కులు పంపిణీచేశారు.. ఈ కార్యక్రమానికి పిఆర్‌జి కాలేజి రిటైర్డ్ ప్రిన్సిపల్ భరతలక్ష్మి, సౌభాగ్యం, కాశీ, ఐద్వా జిల్లా కమిటీ ఆర్థిక సహాయం అందజేశారు.



**నిరసన**

తిరుపతి : పేదలకు ఎంతో ఆసరాగా ఉండే అంగన్వాడీ కేంద్రాలు ఆరోగ్యకరంగా నడవాలని, అంగన్వాడీ కార్యకర్తలు చేస్తున్న ఆందోళనకు ప్రజలు మద్దతుగా నిలవాలని కోరింది.

తిరుపతిలో ప్రభుత్వ పాఠశాలల్లో చదువుతున్న విద్యార్థుల ఇళ్లకు సరుకులు ఇవ్వాలని కోరుతూ ఎస్ఎఫ్ఐ-ఐద్వా- మధ్యాహ్న భోజన పథకం యూనియన్ ఆధ్వర్యంలో నిరసన నిర్వహించారు.

విశాఖపట్నం 69వ వార్డు షీలానగర్‌లో రైతుబజార్ నిర్మించాలని ఐద్వా,సిఐటియు ఆధ్వర్యంలో ప్రెస్‌మీట్ నిర్వహించారు.

**ఇళ్ల స్థలాల కొరకు**

విశాఖ జిల్లాలో అర్హులైన వారందరికి ఇళ్లు, ఇళ్లస్థలాలు ఇవ్వాలని కోరుతూ ఐద్వా, సిఐటియు ప్రతినిధులు సచివాలయం కార్యదర్శికి మెమొరాండం అందజేశారు.

పొదుపు మహిళల సమస్యలు పరిష్కరించాలని నెల్లూరు ఐద్వా నగర కమిటీ అధ్వర్యంలో ప్రెస్ మిట్ నిర్వహించారు.

**అత్యాచారాలు, వేధింపులు**

భద్రాద్రి కొత్తగూడెం నందు 17 సంవత్సరాల గిరిజన బాలికను




అత్యాచారం చేసి హత్యచేసిన నిందితులను ఫాస్ట్రాక్ కోర్టు ఏర్పాటుచేసి కఠినంగా శిక్షించాలని బాలిక కుటుంబానికి న్యాయం చేయాలని ఐద్వా, ఎస్ఎఫ్ఐ ఆధ్వర్యంలో తిరుపతిలో నిరసన కార్యక్రమం జరిగింది.

చింతల వల్లి గ్రామానికి చెందిన బాలికను అదే గ్రామానికి చెందిన వ్యక్తి గత నెల రోజుల నుంచి వెంటపడుతూ, ఫోన్ చేస్తూ ప్రేమించమని వేధిస్తున్నందున బాలిక ఆత్మహత్యాయత్నం చేసిందని అతనిపై 'దిశ' చట్టం ప్రకారం వెంటనే విచారణ జరిపించి, జైలు శిక్ష వేయించాలి అని సంబంధిత పోలీస్ ఆఫీసర్‌ను ఐద్వా, నూజివీడు , క్రిష్ణా జిల్లా కమిటీ అధ్వర్యంలో డిమాండ్ చేసింది.

విశాఖపట్నం, జి మాడుగుల మండలంలోని జన్నేరు పుట్టు గ్రామంలో బాలికపై అత్యాచారానికి పాల్పడిన నిందితులను




కఠినంగా శిక్షించాలని ఐద్వా, గిరిజన మహిళా సంఘం, గిరిజన సంఘం డిమాండ్ చేశాయి. ఈ మేరకు స్థానిక తహసీల్దారు కార్యాలయం వద్ద ఐద్వా జిల్లా సంయుక్త కార్యదర్శి వివి జయ ఆధ్వర్యంలో మహిళా సంఘం, గిరిజన సంఘం, ఎస్ఎఫ్ఐ మండల నాయకులు కె. ధనలక్ష్మి, పి సుమిత్ర, పి రామన్న, కె. రామారావు, ఎస్ బాబురావులు నిందుతులను కఠినంగా శిక్షించాలని డిమాండ్ చేస్తూ నినదించారు. ఈ సందర్భంగా వివి జయ మాట్లాడుతూ బాలికపై అత్యాచారానికి పాల్పడిన నలుగురు నిందితులపై ఎస్సీ, ఎస్టీ అట్రాసిటీ కేసు నమోదు చేయాలని, వారిని తక్షణమే అరెస్టు చేయాలని డిమాండ్‌చేశారు.

తూర్పుగోదావరి జిల్లా రాజమహేంద్రవరంలో ఓ మైనర్ బాలికను బంధించిన ఏడుగురు యువకులు ఆమెపై 4 రోజుల పాటు అత్యాచారానికి పాల్పడ్డారు.

నగరంలోని ఓ చెప్పుల షాపులో సేల్స్ గర్ల్‌గా పనిచేస్తున్న 16 ఏళ్ల బాలిక నాలుగు రోజుల పాటు మోసగించి పనిపేరిట మహిళ సాయంతో తీసుకెళ్లారు.అయితే తమ కుమార్తె నాలుగు రోజులుగా కనిపించడం లేదంటూ ఆమె తల్లిదండ్రులు కోరుకొండ పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేశారు. కానీ పోలీసులు సరిగా స్పందించలేదు.

బాధితురాలిని ఏకంగా పోలీస్ స్టేషన్ బయటే విడిచిపెట్టి పారిపోయారు. మహిళా సంఘాల నాయకులు తులసి నిందితులను కఠినంగా శిక్షించాలని కోరారు.

నంద్యాల పట్టణం పొన్నాపురంలో చందన అనే అమ్మాయి తనను పెళ్లి చేసుకుంటానని నమ్మించి రమేష్ అనే ఓ వ్యక్తి మోసం చేశాడని అతని ఇంటి వద్ద 13 రోజులుగా దీక్ష చేసింది. అయినా పట్టించుకోకపోవడంతో ఐద్వా, వ్యవసాయ కార్మిక సంఘం, డివైఎఫ్ఐల మద్దతుతో పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేసింది.

తూర్పుగోదావరి జిల్లా గరిబ్‌లంకలో ఏఎన్ఎంగా పనిచేస్తున్న మహిళ భర్తకు కరోనా పాజిటివ్ రావడంతో ఆమెను ఇంటిలోని రానివ్వకపోవడంతో ఐద్వా మెడికల్ అండ్ హెల్త్ యూనియన్ నాయకులు ఎస్పికి ఫోన్ చేయగా, పోలీసులను పంపి , ANMని

ఇంట్లోకి పంపారు.




నివాళి

**లక్ష్మి సెహగల్ వర్ధంతి:** విజయవాడ ఐద్వా కార్యాలయంలో లక్ష్మిసెహగల్ గారి వర్ధంతి కార్యక్రమం జరిగింది. రమాదేవి, శ్రీదేవి, భవాని, సాయిలక్ష్మి పాల్గొన్నారు.

బొబ్బిలిలో కెప్టెన్ లక్ష్మీ సెహగల్ వర్ధంతి దెబ్బ గుడి వలస గ్రామంలో జరిగింది. బొబ్బిలి పి హెచ్ డాక్టర్‌కి అన్ని రకాల వ్యాధులకు మెరుగైన చికిత్స అందించాలని వినతి పత్రం ఇవ్వడం జరిగింది

పార్వతీపురం పట్టణంలో ఐద్వా ఆధ్వర్యంలో లక్ష్మీ సెహగల్ వర్ధంతి సభ, సుందరయ్య భవన్, బెల్గాం లో జరిగింది.

కెప్ట్ న్ లక్ష్మీ సెహగల్ గారి వర్ధంతి సందర్భంగా కాకినాడలో జిల్లా వ్యాపితంగా ఆరోగ్యంపై కార్యక్రమం జరిగింది. అందులో భాగంగా జిల్లావ్యాపితంగా ప్రభుత్వ ఆరోగ్య సంస్థలను బలోపేతం చేయాలని అధికారులకు వినతిపత్రాలు సమర్పించాము.

పాత గుంటూరు 4 వ వార్డు చంద్రయ్య నగర్ లో కెప్టెన్ లక్ష్మీ సెహగల్ 8 వ వర్ధంతి సందర్భంగా ఐద్వా జిల్లా కార్యదర్శి ఎల్.అరుణ మాట్లాడారు.

నెల్లూరు జిల్లా : కెప్టెన్ లక్ష్మీ సెహగల్ 8వ వర్ధంతిని స్వాతంత్ర సమరయోధురాలు డాక్టర్ లక్ష్మి సెహగల్ గారి వర్ధంతి సందర్భంగా తిరుపతి సుందరయ్య ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో నివాళి అర్పించారు, కరోనా టైములో కరోనేతర ఆరోగ్య సమస్యలు పట్టించుకోవడం లేదని, గర్భిణులను ప్రత్యేక శ్రద్ద చూపాలని, అన్నీ PHCలు ఓపెన్ చేయాలని, కావలసిన మందులు అందుబాటులో ఉంచాలని, ప్రజా ఆరోగ్యం మెరుగుపరచాలని ఐద్వా నాయకులు డిమాండ్ చేసారు.

**మానికొండ సూర్యావతి వర్ధంతి :** విజయనగరం జిల్లా జిల్లా కమిటీ ఆధ్వర్యంలో గజపతి నగరంలో జిల్లా కార్యదర్శి వి లక్ష్మీ నాయకత్వంలో సూర్యావతి వర్ధంతి జరిగింది.

కృష్ణా తూర్పు కమిటీ ఆధ్వర్యంలో పుణ్యవతిగారితో ఫేస్‌బుక్ లైవ్ జరిగింది.

మొవ్వలో మహిళా సంఘం ఆధ్వర్యంలో మానికొండ సూర్యావతికి నివాళి అర్పించారు. ఈ కార్యక్రమంలో మహిళా సంఘం నాయకురాలు చేబ్రోలు బసవ పూర్ణ, కె లక్ష్మి , కంభం రాణి, నడా సాయమ్మ, ఎల్ పదమ్మ , నడ రాఘవమ్మ తదితరులు పాల్గొన్నారు.

పార్వతి పురం జిల్లా బొబ్బిలి పట్టణంలో మానికొండ సూర్యావతి వర్ధంతి సభలు నిర్వహించారు. 8 వార్డు జిల్లా కమిటీ సభ్యులు కే రోజా రమణి, 9వ వార్డులో ఈశ్వరమ్మ, 13వ వార్డులో ఐద్వా కార్యకర్తలు సూర్యావతికి పూలదండ వేసి నివాళు లర్పించారు.

విజయనగరం ఐద్వా ఆధ్వర్యంలో ఎల్‌బి జి. నగర్లో మానికొండ సూర్యవతి 27వ వర్ధంతి జరిగింది. ఈ సందర్భంగా జిల్లా అధ్యక్షులు రమణమ్మ మాట్లాడుతూ మానికొండ సూర్యవతి దూరాచారాలకు, బాల్యవివాహాలకు వ్యతిరేకంగా వితంతు వివాహాలకు, స్త్రీ విద్య, స్త్రీలకు ఆస్తి హక్కు సమానపని వేతనం కోసం పోరాటాలు చేశారు. ఈ కార్యక్రమంలో జిల్లా సహాయ కార్యదర్శి జి . పుణ్యవతి, కాలనీ మహిళలు పాల్గొన్నారు

నెల్లూరు రూరల్ 24వ డివిజన్ సుందరయ్యనగర్‌లో స్థానిక




ఐద్వా కమిటి ఆధ్వర్యంలో మానికొండ సూర్యావతి గారి వర్ధంతి సభ జరిపి నివాళులర్పించారు.

మానికొండ సూర్యావతి గారి వర్ధంతి సభ విశాఖ సిటీ కార్మిక నగర్ లో జరిగింది ఈ సభలో ఐద్వా రాష్ట్ర అధ్యక్షురాలు బి ప్రభావతి సిటీ ఉపాధ్యక్షురాలు బి అనంతలక్ష్మి ఏరియా అధ్యక్ష కార్యదర్శులు ఏం పద్మ పాల్గొన్నారు

బొబ్బిలి : ఎరుకుల వీధి, కూరకుల వీధిలో కా॥ సూర్యావతి గారి వర్ధంతి సభ జరిగింది. ఈ సందర్భంగా ఐద్వా జిల్లా ఉపాధ్యక్షురాలు వి. ఇందిర మాట్లాడుతూ మొట్టమొదటి మహిళా సంఘం స్థాపకులు, వితంతు పున:ర్వివాహాలు, మహిళలు చదువుకోవాలని ఆ రోజుల్లో ఆమె ఎంతో కృషి చేశారని కొనియాడారు. మద్యం వల్ల కుటుంబాలు చిన్నాభిన్నం అవుతున్నాయని అన్నారు.

ఈ కార్యక్రమంలో ఐద్వా నాయకులు కె. పుణ్యవతి, ఎ. రోజా, చిన్నమ్ములు, దాడమ్మ, నారాయణమ్మ పాల్గొన్నారు.

**టిసీ లక్ష్మమ్మ వర్ధంతి :** కర్నూలు జిల్లా ముజఫర్ నగర్ లోని టిసీ




లక్ష్మమ్మ గారి వర్ధంతి సభ జి.ధనలక్ష్మి అధ్యక్షతన ఘనంగా నిర్వహించారు. ఈ సభకు మహిళా సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షురాలు పి.నిర్మల సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘు బాబు హాజరయ్యారు.

కామ్రేడ్ టి. సి.లక్ష్మమ్మ గారి ఐదవ వర్ధంతి సందర్భంగా స్థానిక ఐద్వా ఆఫీసులో ఐద్వా, డివైఎఫ్ఐ, రైతు, సిఐటియు నాయకులు నివాళులర్పించారు.

సి.పి.ఎం సీనియర్ నాయకురాలు, మహిళా సంఘం జిల్లా ఉద్యమ నిర్మాత కామ్రేడ్ టి.సి.లక్ష్మమ్మ గారి 5వ వర్ధంతి సందర్భంగా 37వ వార్డు లోని నేతాజీ హౌసింగ్ కాలనీలోని ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో సి.రేవతి అధ్యక్షతన టి.సి.లక్ష్మమ్మ గారి వర్ధంతి సభ నిర్వహించారు.

**అరుణకి సంతాపం :** నిజామాబాద్ జిల్లా కార్యదర్శి కామ్రేడ్ అరుణ మృతికి ఆంధ్రప్రదేశ్ ఐద్వా జిల్లా కమిటీ నాయకులు నివాళులర్పించారు.

**వంగపండు, రాజయ్య, షద్రక్‌లకు సంతాపం :** నెల్లూరు జిల్లా 24వ డివిజన సుందరయ్యనగర్ మహిళా సంఘం సభ్యులు , ఐద్వా సభ్యులు కా" సున్నం రాజయ్యకి , వంగపండు ప్రసాద రావుకి, షద్రక్‌కి సంతాపాన్ని తెలియజేశారు.

**కుంచం రమణమ్మకు సంతాపం :** మద్దిలపాలెం ఐద్వా నాయకులు కుంచం రమణమ్మగారు కరోనాతో మరణించారు. వారికి ఐద్వా విశాఖ నగర కమిటీ శ్రద్ధాంజలి ఘటిచింది.

# జాతీయ మహిళా సంస్థల నిరసన

2020 జూలై 19, 30 తేదీలలో ఈ మహిళా సంస్థలు ఆన్‌లైన్ సమావేశ జరిపాయి. ఆహారం, పని, ఆరోగ్య సేవలు, ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం దేశవ్యాప్తంగా నిరసన కార్యక్రమాలు నిర్వహించాలని నిర్ణయించాయి.

ఐద్వా, ఎన్ఎఫ్ఐడబ్ల్యూ, ఎఐపిడబ్ల్యూఎ, పిఎంఎస్, ఎఐఎంఎస్, ఎఐఎంఎస్ఎస్ ఈ సమావేశంలో ఆయా సంస్థల జాతీయ అధ్యక్షులు, ప్రధాన కార్యదర్శులు, ఇతర కార్యనిర్వాహక సభ్యులు పాల్గొని జీవనోపాధి, ప్రజాస్వామ్యాలను డిమాండ్ చేస్తూ ఆగస్టు 28న నిరసన తెలిపాలని జాతీయ మహిళా సంస్థలు పిలుపునిచ్చాయి. కరోనా విపత్తు, లాక్‌డౌన్లు మహిళల ఉపాధి, ఆహార భద్రత క్షీణించాయి. అట్టడుగు వర్గాల జీవితాల్లో వినాశనం సృష్టించాయి. అనేక మంది ప్రజలు జీవనోపాధి కోల్పోయారు. ఆకలి చావులు పెరిగాయి. రేషన్ పంపిణీలో అవకతవకలు జరిగాయి. పేద కుటుంబాలు ఆహారా ధాన్యాలు పొందే హక్కు పోగొట్టుకున్నాయి. ప్రజా ఆరోగ్యం సేవల ప్రైవేటీకరణ ప్రజలను నిస్సహాయ స్థితిలోకి నెట్టింది. కోవిడ్ కేసులు తప్ప మరే ఇతర అనారోగ్యాలను ఆరోగ్య వ్యవస్థ పట్టించుకోవడం లేదు. గర్భిణులు, బాలింతలు అంతులేని ఇబ్బందులకు గురవుతున్నారు. గృహ హింస పెరిగింది. స్వయంసహాయక బృందాలలో మహిళలను కిస్తిల కొరకు వేధిస్తున్నారు. ఇవేం పట్టించుకోకుండా ప్రైవేటీకరణ ఎజెండాతో బిజెపి ప్రభుత్వం ముందుకు దూసుకుపోతోంది. ముందస్తు ప్రణాళిక లేని లాక్‌డౌన్ వల్ల ఇబ్బందులకు గురయిన వలస దారులకు, మహిళలకు, కార్మికులకు నగదు సహాయం అందిస్తామని ఇచ్చిన హామీలను ప్రభుత్వం నెరవేర్చ లేదు. అధికార విధానాలకు వ్యతిరేకంగా నిరసనలకు న్యాయకత్వం వహించిన కార్యకర్తలపై మోడీ ప్రభుత్వం తప్పుడు కేసులు నమోదు చేసింది మోడీ ప్రభుత్వం. మైనార్టీలు మోడీ ప్రభుత్వం చేపడుతున్న కృర చర్యలకు వ్యతిరేకంగా అసమ్మతి తెలియజేస్తున్న కార్యకర్తలు, విద్యార్థులను లక్ష్యంగా చేసుకోవడాన్ని వ్యతిరేకిస్తూ నిరంతరం ప్రచారం చేయాలని నిర్ణయించుకున్నామని తెలిపారు. కరోనా సమయంలో ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటున్న మహిళలకు సహాయ పడ్డానికి అత్యవసర చర్యల అమలు కొరకు మహిళలను పెద్ద ఎత్తున సమీకరించడం అవసరమని జాతీయ మహిళా సంస్థలు నిర్ణయించాయి. ప్రస్తుత సమస్యలన్నిటిపై విశాల విస్తృత పోరాటాలు జరపాలని అన్ని రాష్ట్రాల్లో మహిళా సంఘాల సంయుక్త ఆధ్వర్యంలో ఆగస్టు 28న నిరసనలు చేపట్టాలని పిలుపునిచ్చాయి.

release order no. 12/Sou/Advt.II/2020-21

మహిళా సాధికారతే లక్ష్యంగా అక్కచెల్లెమ్మల జీవితాల్లో వెలుగులు
నింపడానికి జగనన్న ప్రభుత్వం అందిస్తున్న కానుక...

# వైఎస్సార్ చేయూత

మారనున్న అక్కచెల్లెమ్మల భవిత...

**45 నుండి 60 ఏళ్ల మధ్య వయస్సు గల**
ఎస్సీ, ఎస్టీ, బీసీ, మైనార్టీ పేద అక్కచెల్లెమ్మలను చేయి పట్టుకుని నడిపిస్తూ, ఏటా రూ.18,750 చొప్పున
నాలుగేళ్లలో రూ.75,000 ఆర్థిక సాయం అదే అక్కచెల్లెమ్మలకు అందిస్తూ,
వారికి జీవనోపాధి మార్గాలను సైతం చూపిస్తూ, వారికి తోడుగా మా జగనన్న...



నేడే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి
**శ్రీ వై.ఎస్. జగన్ మోహన్ రెడ్డి** గారి
చేతుల మీదుగా ప్రారంభం

## గతంలో ఏ ప్రభుత్వం అందించని విధంగా దాదాపు 23 లక్షల మంది అక్కచెల్లెమ్మలకు 4 ఏళ్లలో రూ.17,000 కోట్ల లబ్ది

45-60 ఏళ్ళ మధ్య వయస్సుగల వారికి వైఎస్సార్ చేయూత ద్వారా లబ్ది.. 60 దాటితే,ఆ తరువాత ఎలాగూ వైఎస్సార్ పెన్షన్ కానుక అందుకుంటారు! జగనన్న ప్రభుత్వం తీసుకు వచ్చిన విప్లవాత్మక మార్పుల్లో భాగంగా 60 ఏళ్ళు పైబడ్డ పేద అక్కచెల్లెమ్మలు ఇప్పటికే నెలకు రూ. 2,250 చొప్పున మొదటి తారీఖునే ఠంచనుగా నెలనెలా వైఎస్సార్ పింఛను కానుక అందుకుంటున్నారు...

వైఎస్సార్ చేయూత పథకం ద్వారా పొందే డబ్బు వాడడంలో అక్కచెల్లెమ్మలకు పూర్తి స్వేచ్ఛ.. దీన్ని జీవనోపాధి కార్యక్రమాలకు, చిన్న మధ్య తరహా వ్యాపారాలను నడుపుకోడానికీ లేదా మరే ఇతర అవసరానికైనా వినియోగించవచ్చు

ప్రభుత్వం సూచించిన జీవనోపాధి పొందే మార్గాలపై ఈ డబ్బును వినియోగిస్తే, లబ్దిదారులైన మహిళల సామర్థ్యాన్ని పెంచడంతో పాటు మార్కెటింగ్, సాంకేతికపరమైన సహకారాన్నీ అదనపు బ్యాంకు రుణాలూ, అందించేలా ప్రభుత్వం చర్యలు చేపడుతుంది...

సాంకేతిక, మార్కెటింగ్ సహకారాలు అందించేలా ఇప్పటికే AMUL, ITC, HUL, P&G, RELIANCE లాంటి ప్రఖ్యాత, దిగ్గజ కంపెనీలతో పాటు బ్యాంకులతో కూడా అవగాహనా ఒప్పందాలు.. దీనివల్ల అక్కచెల్లెమ్మలకు వ్యాపార అవకాశాలు కలుగజేస్తున్నాం...

ఇప్పటికే ప్రతి నెలా సామాజిక పింఛన్లు అందుకుంటున్న 45 నుండి 60 సం॥ల వయస్సు గల దాదాపు 8 లక్షల మంది ఒంటరి మహిళలు, వితంతువులు, వాళ్ళ కాళ్ళ మీద వారు నిలబడటానికి, పింఛన్‌కు అదనంగా వైఎస్సార్ చేయూత ద్వారా లబ్ది..
ఏటా పింఛన్ల ద్వారా
రూ. 2,250 X12నెలలు = రూ.27, 000 +
చేయూత ద్వారా రూ.18,750
మొత్తం లబ్ది ఏటా = రూ. 45,750

ఫిర్యాదులు, సహాయం కొరకు టోల్ ఫ్రీ నెంబర్
**1902**

## వైఎస్సార్ చేయూత... సుసాధ్యమవుతున్న మహిళా సాధికారత...

శ్రీ చెల్లుబోయిన శ్రీనివాస వేణుగోపాలకృష్ణ
వెనుకబడిన తరగతుల సంక్షేమ శాఖా మంత్రి

వ్యవసాయ & అనుబంధ సేవలు - 1907 | టెలీ మెడిసిన్ సేవలు - 14410 | అవినీతి పై ఫిర్యాదులు -14400 | దిశ -181 | మద్యం అక్రమ తయారీ, అమ్మకం, రవాణా & ఇసుక పై ఫిర్యాదులు - 14500

R.NO. APBIL/2019/78298

CHAITANYA MANAVI Vol. : 2 ISSUE : 8,9 GUNTUR, August, September 2020, 56 Pages Rs. 20/-

# ఆగస్టు 9న రాష్ట్ర, కేంద్ర ప్రజావ్యతిరేక విధానాలపై నిరసన










ఆశావర్కర్ల సమస్యలు పరిష్కరించాలంటూ




ఉపాధి కల్పించాలని కోరుతూ




వైద్యసదుపాయాలు మెరుగుపరచాలని వినతి




సారా వద్దంటూ యువత నిరసన

చైతన్య మానవి

ఐద్వా రాష్ట్ర కార్యాలయం

31-5-6, ప్రకాశరావు వీధి, మారుతీ నగర్,

చుట్టుగుంట వద్ద, విజయవాడ - 4

ఆంధ్రప్రదేశ్.

ఫోన్ : 94900 98620



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMVGIA 194 |
| పుస్తకం పేరు | చైతన్య విహారి |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | pragathi |
| పరీక్ష చేసినది | MOUNIKA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |